## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit,<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!



ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# శ్రీభగవద్గీత

## గేయకృతి

తెలుగుసేత

డా॥ కసిరెడ్డి

ప్రచురణ

జాతీయ సాహిత్యపరిషత్

భాగ్యనగర్ శాఖ, ఆంధ్రప్రదేశ్

# నీరాజనం

1-0 : ఈ గేయ భగవద్గీత 1972 జనవరిలో మొదట అచ్చయ్యింది. ఇది రెండోసారి రావడానికి వనస్థలిక్లబ్ సభ్యమిత్రుల ఆర్థికహార్దిక సహకారం మరువరానిది. ముఖ్యంగా సెయింట్ డామ్నిక్ విద్యాసంస్థల అధినేత మాన్య మిత్రులు శ్రీపి.ఎస్. రెడ్డిగారు, యువజన నాయకులు శ్రీగంగుల గోవర్ధన్‌రెడ్డి గారు పూనుకొని ముందడుగు వేయకపోతే ఇది ప్రకటించడం కష్టసాధ్య మయ్యేది. ఈప్రచురణ పవిత్ర కార్యానికి సహకరించిన వనస్థలిక్లబ్ బంధు బృందానికి వందనాలు.

ఈ ప్రచురణలో మిశ్రగతి సరిగా తీసుకొని రావడానికి ప్రయత్నం చేశాను. అయితే భావస్పష్టతకే ప్రాధాన్యాన్ని ఇవ్వడంవల్ల అక్కడక్కడ గతి తప్పడం జరిగింది. కొన్ని సంయుక్తాక్షరాల పూర్వాక్షరాల్ని తేల్చి పలికే పద్ధతి పాటిస్తూ, పూర్వాక్షరాన్ని ఒకే మాత్రగా పరిగణిస్తూ అక్కడక్కడ నియమాలను మీరడంకూడా జరిగింది. గీతార్థ స్పష్టతకే ఈ ప్రయత్నం తప్ప శాస్త్రం మీద అవిధేయతగానీ, అజ్ఞతగానీ కాదనీ సవినయంగా విన్న వించుకొంటున్నాను. ప్రథమ ముద్రణలో అనుష్టుప్పులన్నీ నాలుగు పాదాలుగా, అన్యశ్లోకాలు అయిదు పాదాలుగా ఉన్నాయి. అయితే ఈ ముద్రణలో ఒకటి రెండు అనుష్టుప్పుల్ని కూడా అయిదు పాదాలుగా మార్చడం జరిగింది. స్పష్టభావావిష్కారానికి, గేయ గమనానికి ఇచ్చిన ప్రాధాన్యంతోపాటు, ఈపర్యాయం జనవ్యవహార భాషకు తగినంత చోటు ఇవ్వడమూ జరిగింది. సామాన్యునికీ-సగటు మనిషికీ గీత అర్థంకావాలనే ఈనా ప్రయత్నం ఎంత వరకు నెరవేరిందో సహృదయులే చెప్పాలి.

ప్రథమ ముద్రణలోని ముందు మాటలన్నీ ఉన్నవి ఉన్నట్టుగా ఇవ్వడం మర్యాద. అందువల్ల కలువకుర్తి క్రాంతిసాహితి కార్యదర్శి తొలిసుడువులను, నా నివేదన, కృతజ్ఞతలను ఉన్నవి ఉన్నట్టుగా ఈ క్రింద ఇస్తున్నాను.

## 1-1 : తొలిసుడువులు (పథమ ముద్రణలోనిది)

మా క్రాంతి సాహితీ సంస్థస్థాపనానంతరము ప్రథమచైతన్యకళికగా శ్రీకసిరెడ్డి వేంకటరెడ్డి గారి ఆంధ్రీకృత భగవద్గీతను పాఠకలోకానికి అంది స్తున్నందుకు ఎంతో గర్విసున్నాం. శ్రీకృష్ణ పరమాత్ముని పాదకమల నీ రాజనంగా ఈ గ్రంథం వాసి గాంచాలవి మా అభిలాష. పాఠకులు తమ తమ అభిప్రాయములను క్రాంతి సాహితికి తెలిపి మమ్ములను ప్రోత్సహించాలని కోరుతున్నాం.

కలువకుర్తి

కార్యదర్శి
క్రాంతిసాహితి

## 1-2 : నివేదన (ప్రథమ ముద్రణలోనిది)

పూర్వక శ్రేయస్సునకు, విశ్వకళ్యాణమునకుపయోగపడు సత్పుస్తకము గ్రంథరాజములలో వ్యాస విరచితమైన శ్రీ భగవద్గీతకగ్ర స్థానమున్నది. గీర్వాణ భాషాలంకారమైనయిది తద్భాషానభిజ్ఞులకు సులభగ్రాహ్యార్థమై ఎందరో మహానుభావులెన్నోరకముల టీకాతాత్పర్య వ్యాఖ్యాదులను వెలయించిరి.

ఆ సంస్కృత భాషాజ్ఞాన మంతగాలేని నేను ముత్యాల సరములలో తెనిగించుటకు పూనుకొనుట సాహసమే. నేను నిమిత్తమాత్రుడను; అంతయు నా భగవంతుని చలువనే.

[illegible] అధ్యాయములందున్న 701 శ్లోకములలో 646 అనుష్టుప్పులు. మిగిలినవి అన్యములు. అన్యములైన ఆయేబదియైదు తెనుగునను నైదు పాదములున్నవని గ్రహింపవలయును.

ఈనా తెనిగింపున నటనట మూలము నతిక్రమించుటయో వదలుటయో జరుగ వచ్చును. కేవల రంధ్రాన్వేషులుగాక రసహృదయముతో తెలిపిన వారికి కృతజ్ఞుడను. భవిష్యత్తులో సవరింపునకు వారు మార్గదర్శకులు కాగలరు.

"నిన్దన్తు నన్దన్తుమమప్రమోదః"

మాడ్గుల — భక్తజనవిధేయుడు

11-1-1972 — కసిరెడ్డి వేంకటరెడ్డి

## 1-3 : కృతజ్ఞతలు (ప్రథమ ముద్రణలోనిది)

అడిగినంతనే గ్రంథముద్రణమునకై విరాళములిచ్చిన దాతలందరికిని కృతజ్ఞతలు.

1968 మే పంచాయతీ రాజ్యం పక్షపత్రికలో ప్రారంభించి దాదాపు రెండు సంవత్సరాలు వరుసగ ఈనా తెనుగు గీతాగేయముల ప్రచురించిన సంపాదకులు శ్రీచిత్రావూరు నాగభూషణా చార్యులుగారికిని,

అప్పుడప్పుడు సామూహిక పారాయణ సందర్భములయందు, ఇతర సమయములందును ఈ గేయములను విని తమతమ అభిప్రాయములను తెలిపి ప్రోత్సహించిన శ్రీ సూదిని నారాయణరెడ్డి, సత్యనారాయణరెడ్డి, నర్సింహారెడ్డి, మల్లయ్య, సత్తయ్యగారలకు కృతజ్ఞతలు.

ఇట్లు

11-1-1972 — రచయిత

## 1-4 : మేలుకొలుపు

ఈ ప్రపంచంలోకి శ్రీభగవద్గీత ఏ ఒక్క వ్యక్తినో, ఏ ఒక్క జాతినో ఉద్దేశించిరాలేదు. శ్రీకృష్ణభగవానుడు పార్థునికిచ్చిన సందేశాన్ని ప్రపంచానికి అందించాలనే సంకల్పంతో వేదవ్యాసులు మహాభారతమనే శరీరంలో 'గుండె'లాగా దీనిని అమర్చారు. ఆమహర్షి క్రాంత దర్శనంతో ఆవిర్భవించిన భారతాంతర్గత శ్రీభగవద్గీత అడుగడుగునా 'చెడు' మీద పోరాటంచేసి 'మంచి'ని స్థాపించుమనే ఆదేశిస్తుంది.

నీవు వ్యక్తివి; కుటుంబంలో ఒకనివి· సమాజంలో భాగానివి; దేశంలో ఓకేంద్రబిందువువు. వ్యక్తిమీద, కుటుంబంమీద, సమాజంమీద, దేశంమీద, నీభూమిమీద నిరంతరం దాడులు జరుగుతుంటే, నీ ఉనికికీ, నీమనికకీ ప్రమాదం ఏర్పడితే నీవుండే దెక్కడ ! నీసంస్కృతి ఎక్కడ ! నీధర్మ మెక్కడ !

నీది మను భూమి; నీసంస్కృతి మానవ సంస్కృతి; నీధర్మం మానవధర్మం.

అందరిని ఆదరించిన నీమీద సైతాన్ (అధర్మం) విరుచుకు పడుతున్నది. ఆ అధర్మాన్ని ఆనాడు అర్జునుడు ఎదిరించాడు. అతను ఎదిరించి, పోరి, విజయం సాధించడానికి ఈ గీతాసందేశమే స్ఫూర్తినిచ్చింది

ఈరోజు ఈమానవ ప్రపంచానికి ఈభగవద్గీతే స్ఫూర్తినిస్తుంది; శక్తి నిస్తుంది. ఈమానవులందరూ విషాదయోగంలో మునిగిన అర్జునులే. ఈ అర్జునులను (నరులను) మేలుకొల్పడానికే ఆవిర్భవించిన శ్రీభగవద్గీత అందరూచదవాలి; అర్థంచేసుకోవాలి; ఆచరణ పథంలో ముందడుగువేయాలి.

రోజూ పారాయిణం చేయండి; మీ ఇష్టం-ఒకటి, రెండు, మూడు ఎన్ని అధ్యాయాలైనా సరే ! మీ వికాసానికి భగవద్గీత ఎలాదోహదం చేస్తుందో పరిశీలించి తెలుసుకోండి ! ఎవరికి వారే ప్రమాణం, అందరికీ గీతప్రమాణం. గీతార్థ సారం గ్రహించిం తర్వాత, ఉపనిషత్తులవైపు, వేదాలవైపు దృష్టి సారించండి. మీరుమేలుకొంటారు, ప్రపంచాన్నే మేలుకొల్పుతారు.

కృష్ణనగర్; భాగ్యనగర్ — విధేయుడు
ప్రజోత్పత్తి, జ్యేష్ఠ శుద్ధత్రయోదశి — **కసిరెడ్డి**
హిందూ సామ్రాజ్య పర్వదినం
1991 జూన్ 25

## * ధ్యానం *

ఓం శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వ విఘ్నోప శాన్తయే.

ఓం అఖండమండలాకారం వ్యాప్తంయేన చరాచరమ్,
తత్పదందర్శితంయేన తస్మైశ్రీగురవేనమః
ఓం కృష్ణం కమలపత్రాక్షం పుణ్యశ్రవణ కీర్తనమ్
వాసుదేవం జగద్యోనిం నౌమి నారాయణం హరిమ్
ఓం వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే
నమోవై బ్రహ్మనిధయేవాసిష్ఠాయ నమోనమః
ఓం నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీం వ్యాసం తతోజయముదీరయేత్
ఓం ప్రపన్నపారిజాతాయ తోత్రవేత్రైకపాణయే
జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృత దుహేనమః
వసుదేవసుతందేవం కంసచాణూర మర్దనమ్
దేవకీపరమానందం కృష్ణం వన్దే జగద్గురుమ్
భీష్మద్రోణతటా జయద్రథజలాగాన్ధారనీలోత్పలా
శల్యగ్రాహవతీకృపేణ వహనీకర్ణేన వేలాకులా
అశ్వత్థామ వికర్ణ ఘోరమకరా దుర్యోధనావర్తినీ
సోత్తీర్ణాఖలు పాణ్డవైరణనదీకైవర్తకః కేశవః.

మూకంకరోతివాచాలం పఙ్గుంలఙ్ఘయతేగిరిమ్
యత్కృపాతమహంవన్దే పరమానన్ద మాధవమ్.
యం బ్రహ్మవరుణేన్ద్ర రుద్రమరుతః స్తున్వన్తి దివ్యైస్తవైః
వేదైస్సాంగ పదక్రమోపనిషదైర్గాయన్తియం సామగాః
ధ్యానావస్థిత తద్గతేన మనసా పశ్యన్తియంయోగినో
యస్యాన్తం నవిదుః సురాసురగణా దేవాయతస్మైనమః

ఓం నమోస్తుతేవ్యాసవిశాలబుద్ధే-పుల్లారవిన్దాయతపత్రనేత్ర
యేనత్వయాభారతతైలపూర్ణః-ప్రజ్వాలితోజ్ఞానమయః ప్రదీపః

పార్థాయప్రతిబోధితాంభగవతానారాయణేనస్వయమ్
వ్యాసేనగ్రథితాం పురాణమునినామధ్యే మహాభారతమ్
అద్వైతామృతవర్షిణీం భగవతీమష్టాదశాధ్యాయినీ
మమ్బత్వామనుసందధామి భగవద్గీతేభవద్వేషిణీమ్.
సర్వోపనిషదోగావోదోగ్ధా గోపాలనన్దనః
పార్థోవత్సః సుధీర్భోక్తాదుగ్ధం గీతామృతం మహత్.
మలనిర్మోచనంపుంసాం జలస్నానం దినేదినే
సకృద్గీతామృతస్నానం సంసారమలమోచనమ్

ఓం శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీభగవద్గీత

ఒకటవ అధ్యాయం

## అర్జున విషాద యోగం

*** ధృతరాష్ట్రుడు ప్రశ్నించాడు:-**

ధర్మక్షేత్రం కురుక్షేత్రం
ధాత్రియుద్ధం చేయగూడిన
నా కుమారులు పాండు పుత్రులు
ఏమిచేసిరి సంజయా! —1

*** సంజయుడు ఇలా సమాధానమిచ్చాడు:-**

వ్యూహవిరచిత పాండు సైన్యం
రాజు దుర్యోధనుడు చూసెను
గురుశ్రేష్ఠుండైన ద్రోణుని
కడకునేగెను పలికెనిట్టుల. —2

గురుశ్రేష్ఠా! కాంచుమదిగో
బుద్ధిమంతుడు మీప్రశిష్యుడు
వ్యూహరచితుడు ద్రుపద పుత్రుడు
పాండుపుత్రుల మహత్సేనను —3

ఎందరో విలుకాండ్రు కలరిట
యుద్ధమున భీమార్జునాదుల
జోడువారలు ద్రుపద విరటులు
పోరువీరులు శూరులున్ —4

ధృష్టకేతువు చేకితానుడు
విక్రముండగు కాశిఅధిపతి
పురుజితుండును కుంతిభోజుడు
శైబ్యుడు త్తముడున్ —5

యుధామన్యుడు ఉత్తమౌజుడు
యుద్ధవీరులు స్థైర్యవంతులు
ద్రౌపదేయ సుభద్ర సూతియు
మహారథులే యందరున్ —6

జ్ఞాపకార్థము మనసేనగల
ప్రముఖులను సేనాధిపతులను
ద్విజశ్రేష్ఠా! శూరవీరుల
తెలియజేసెద నిప్పుడే —7

మీరు భీష్ముడు కృపాచార్యుడు
కర్ణుడునుమరి ద్రోణపుత్రుడు
వికర్ణుండును సౌమదత్తుడు
సంగరాంగణ మందుశ్రేష్ఠుల్ —8

ఎందరో వీరాధివీరులు
ముందుగా తమ జీవితమ్ములు
నాకు అర్పణచేయ నిల్చిరి
శస్త్రములు అస్త్రాలు దాల్చిరి —9

అట్టిశూరుల మన సుసైన్యము
భీష్మరక్షితమై యజేయము
భీమరక్షిత పాండు సైన్యము
ఓడగొట్టగ మనకు శక్యము 10

వ్యూహమార్గములందు మీరలు
నియమిత స్థానంబు లందున
నిల్చియుండియు అన్ని ప్రక్కల
భీష్మనే రక్షించ వలయును -11

కురువృద్ధుడు పితామహుడును
వీరభీష్ముడు ప్రభునకప్పుడు
సంతసము కలుగంగశంఖము
ఒత్తినాడయ్యా! -12

వెంటనే శంఖాలు భేరులు
ఆనకమ్ములు గోముఖమ్ములు
పణవముల సంకీర్ణనాదము
లెన్నొ చేసిరి కౌరవుల్ -13

తెల్లగుఱ్ఱాల్ పూన్చియుండిన
మహారథమున పార్థకృష్ణులు
కలిసికూర్చొని దివ్యశంఖాల్
గట్టిగా ఊదారుగా -14

పాంచజన్యము హృషీకేశుడు
దేవదత్తము ధనంజయుడును
భీమకర్మండైన భీముడు
పౌండ్రనామక శంఖమూదిరి -15

కుంతిపుత్రుడు యమతనూజుడు
ఊదెననంత విజయశంఖము
సుఘోషమణి పుష్పకాలను
ఊదిరినకుల సహదేవుల్ -16

ధనుర్ధారుడు కాశిపాలుడు
రాజు విరటుడు రథి శిఖండియు
ధృష్టద్యుమ్నుడజేయ సాత్యకి
తమతమ శంఖంబు లూదిరి —17

ద్రుపదుతును పాంచాలిపుత్రులు
రాజులెల్లరు మహాబాహుసు
భద్రపుత్రుడు, వేరువేరుగ
సేనలోశంఖంబు లూదిరి —18

పాండవేయుల శంఖములధ్వని
దివినిభువినే దద్దరించెను
ధార్తరాష్ట్రుల గుండెలన్నిట
చీల్చివేసెనుగా! -19

అంతరణ రంగంబు నందున
అయుధాలుప్పొంగు వేళను
రణాకాంక్షుల చూచెపార్థుడు
చేతగాండివముండగా. -20

అప్పుడిట్టుల కృష్ణతోతన
మాటచెప్పెను మహీపాలక!

*** అర్జునుడు ఇలా అడిగాడు:-**

రెండు సేనల మధ్యరథమును
ఆపుమోయీ అచ్యుతా! -21

ఆజిలోప్రథమాన ఎవరితొ
పోరుసల్పగ వలెనొ, ఆ-యు
ద్ధాభిలాషుల చూడ గల-ఆ
చోట్రథమును నిలుపుమా! -22

దుష్టదుర్యోధనుని కొరకై
రణములోప్రియ మాచరించగ
వచ్చియుండిన యుద్ధయోధుల
నేను చూస్తానూ! -23

*** సంజయుడిలా చెప్పాడు:-**

వీరభారతరాజ! పార్థుడు
ఇలాచెప్పగ గుడాకేశుడు
శ్రేష్ఠరథమును రెండు సేనల
మధ్య నాపెనుగా! -24

ప్రముఖులాభీష్ముండు ద్రోణుడు
ఎల్లరాజుల ఎట్టఎదుటను
తేరునిలిపెను, కూడియుండిన
కౌరవుల చూడుమన్నాడు. -25

పార్థుడంతట రెండు సేనల
లోననిల్చిన తాతతండ్రుల
గురులమామల అన్నదమ్ముల
కొడుకలను మనుమల మిత్రులన్. -26

మామలను హితవరుల ప్రజలను
రెండువైపుల ఉన్న రాజుల
యుద్ధమునకై నిలిచియుండిన
ప్రముఖులను బంధువుల చూచెన్. -27

కృపాపూర్ణుం డైనపార్థుడు
దుఃఖితుండై వలికెనిట్టుల

*** అర్జునుడిలా అన్నాడు:-**

కృష్ణ! యుద్ధముకొరకు నిలిచిన
స్వజనులనునే చూచినాడను. -28

అవయవమ్ములు తవ్వుకొన్నవి
గళము ఎండుక పోవుచున్నది
దేహమంతయువణకు చున్నది
పులకరింతలు పుట్టుచున్నవి. -29

గాండీవముచే జారుచున్నది
చర్మమంతా మండుచున్నది
నిలువశక్తియె లేక ఉన్నది
మనసు గిఱ్ఱున తిరుగుచున్నది- -30

అశుభసూచక శకునములనే
చూచుచుంటిని కృష్ణమూర్తీ!
ఆజిలోబంధువుల జంపిన
పొందబోయెడి లాభమెద్దియొ! -31

విజయమైనను రాజ్యమైనను
సుఖమునైనను కోరకృష్ణా!
రాజ్యములతో భోగములతో
జీవితముతో నేమిఫలము! -32

ఎవరికొరకై ఇట్టిరాజ్యము
భోగభాగ్యాల్ కోరుచుంటిమొ
వారలందరు రణాకాంక్షులు
ప్రాణధనముల కాంక్ష వదలిరి. -33

గురులుతండ్రులు సుతులు తాతలు
మేనమామలు బావమరదులు
మామలుండిరి మనుమలుండిరి
సంబంధులే మనకందరున్. -34

నన్ను చంపాలన్న వీరిని
త్రిలోకపదవికైన చంపను
ఇక ఈ భూలోకరాజ్యము
కొరకు చంపుదునా! -35

ధార్తరాష్ట్రుల చంపగా మన
కేలముదములు కలుగు కృష్ణా!
దుష్టులీరల త్రుంచివేయగ
మనకు పాపమె కలుగునయ్యా! -36

వీరుబంధువులందువలననె
కౌరవాదుల చంపతగమిక
మనకు చెందిన వీరిచంపిన
సుఖముగానెటులుందుమయ్యా! -37

రాజ్యలోభపు భ్రష్టచిత్తులు
వంశనాశన దోషఫలమును
మిత్రద్రోహపు పాతకంబును
తెలియకున్నారు. -38

వంశనాశనదోషఫలమును
తలిసియుండిన మనమదేలకొ
పాపకృత్యము వీడకూడదొ
తెలువ లేదయ్యా! -39

కులముచెడగా పూర్వముండిన
కులముధర్మములన్నిపోవును
ధర్మనష్టంబైన కులమున
ధర్మముండదధర్మమే! -40

అయధర్మము జగతి పెరిగిన
కులం మహిళలు చెడుదు రెంతో!
స్త్రీలు చెడితే కృష్ణ కృష్ణా!
వర్ణసంకరమవ్వునయ్యా! -41

సంకరముతో కులము చెరచిన
వారికి నియా వంశమునకును
నరకప్రాప్తే; పితరవరులకు
పిండముండదు సుగతియుండదు. -42

వంశనాశన వర్ణ సంకర
దోషములచే శాశ్వతములగు
వంశధర్మాల్ వర్ణధర్మాల్
నాశనంబగును. -43

వంశధర్మాల్ వాడిపోయిన
మానవాళికి శాశ్వతంబగు
నరకమే ప్రాప్తించుననగా
వింటిమేమయ్యా! -44

కటకటా! ఈరాజ్యసుఖముల
పైన ఉండిన ఆశ చేతనె
బంధువుల చంపంగ పూనితి
మెంతొ పాపముగా! -45

శస్త్రముల ధరియించ నెంచని
నన్ను రణరంగంబునందున
శస్త్రధారులు ధార్తరాష్ట్రులు
చంపినా క్షేమంబెయగును. -46

శోకకలితుండైన పార్థుడు
యుద్ధసిద్ధస్థలిని పలుకుచు
బాణచాపము వదలిపెట్టెను
రథముపైననె కూలబడియెను. -47

* ఉపనిషత్ర్పతి పాదగీతము
బ్రహ్మవిద్యయు యోగశాస్త్రము
కృష్ణనరసంవాద తత్త్వము
అర్జున విషాదయోగంబు:





ఓం శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీభగవద్గీత

## రెండవ అధ్యాయం

## సాంఖ్య యోగం

*** సంజయుడిలా చెప్పాడు:-**

కృపాపూర్ణుండైన పార్థుడు
బాష్పపూరిత లోచనుండై
చలితుడై దుఃఖించుచుండగ
పలికె మాధవుడిట్టులన్ -1

*** శ్రీ భగవానుడిలా అన్నాడు:-**

పామరులు పాటించునయ్యది
స్వర్గమీదవకీర్తివచ్చును
ఇద్దికశ్మలమిదియనార్యము
విషమసమయావేలవచ్చెను. -2

క్లైబ్యమెందుకుః పొందకయ్యాః
తగదునీకిది క్షుద్రమయ్యాః
హృదయ దౌర్బల్యమ్ము వీడుము
పరంతపుడః లేవయ్యాః -3

*** అర్జునుడు అడిగాడు:-**

నాకుపూజ్యులు భీష్మద్రోణులు
ఎట్లు శరసంధానమయ్యా!
శత్రుసూదనామధుసూదన!
ఎట్లుయుద్ధము చేతునయ్యా! -4

పెద్దలను గురువులను చంపుట
కిన్నలోకము నందుభిక్షము
తినుటమంచిది; చంపి ఇచటనె
రక్తలిప్తాలైన భోగాల్
అనుభవించుటలా! -5

ఏదిశ్రేష్ఠమొ మనకు తెలియదు
యుద్ధమునజయమెవరిదవునో!
మనదొవారిదొ! చెప్పజాలము!
చంపి ఎవరిని, బ్రతక తలచమొ
ఆ మహాత్ములె ఎదుట నుండిరి. -6

ఆత్మజ్ఞానంబంత మవగా
ధర్మమనుమానించి అడిగితి!
ఏదినిశ్చిత శ్రేయ మయ్యా!
నీకుశిష్యుడ! శరణు పొందితి!
చెప్పుమా! శాసించుమా! -7

శత్రురహితమ్మయిన భూమిని
శ్రేష్ఠరాజ్యం పొందికూడా
దేవపదమును అందికూడా
ఇంద్రియముల తపించుశోకము
నణచునేదో తెలియకుంటిని!

### * సంజయుడిలా అన్నాడు:-

పరంతపుడగు గుడాకేశుడు
ఇలా కృష్ణునితో వచించెను
నేనుయుద్ధము చేయలేనని
ఊరకనె ఉండెన్. —9

రెండు సేనల మధ్యదుఃఖము
పొందుపార్థుని చూచికృష్ణుడు
మందహాసముఖుండు నవ్వుచు
పలికె ప్రభువర్యా! —10

### * శ్రీకృష్ణుడిలా అన్నాడు:-

ఏడ్వగూడని వారికేడ్చితి
బుద్ధివాదం పెంచి పలికితి
బ్రతుకువారిని చచ్చువారిని
గూర్చిపండితుడేడ్వబోడోయ్. —11

నేనుగానీ నీవుగానీ
యుద్ధమందలి నృపులుగానీ
లేనివారము కాముముందును
లేకపోయెడు మాటలేదోయ్. —12

దేహికీదేహంబునందున
బాల్యయౌవనములును వృద్ధత
అట్లె మరియొకటగు శరీరము
జ్ఞానిదీనికి మోహమందడు. —13

ఇంద్రియపు శబ్దాది విషయాల్
శీతోష్ణ సుఖదుఃఖదమ్మలు
వచ్చిపోవును స్థిరము కావవి
ఓర్చుకొనుమోయర్జునా! —14

దుఃఖసుఖముల సముడుధీరుని
ఈ విషయములు బాధపెట్టవు
అట్టిజీవుడు ముక్తికర్హుడు
అగును అర్జునుడా! —15

లేనిదానికి ఉనికిలేదోయ్
ఉన్నదానికి లేమిలేదోయ్
జ్ఞానులీరెండింటి నిశ్చయ
ములనుబాగుగ తెలిసినారలు 16

జగతియే పరమాత్మ చేతన్
వ్యాప్తమైనదొ, నాశరహితము
అవ్యయంబగునట్టి యాత్మకు
నాశమెవ్వడు చేయజాలడు -17

అప్రమేయము నాశరహితము
నిత్యమగునీ యాత్మదేహము
నాశవంతము లనగబడినవి
కనుక యుద్ధమొనర్చు పార్థా! —18

ఆత్మచంపును ఆత్మచచ్చును
అనిగ్రహించిన వారలెవ్వరు
యదార్థమ్మును ఎరుగలేదోయ్
ఆత్మచంపదు ఆత్మచావదు. —19

ఆత్మ పుట్టదు ఆత్మ చావదు
లేక క్రొత్తగ మళ్లి కలుగదు
జననమరణము లేదు నిత్యము
శాశ్వతదేహము చంపబడదిది
ఇది సనాతనమిదియమోఘము. -20

జననమరణము లేనిదాత్మని
నాశరహితము నిత్యమేయని
ఎవ్వడెరుగునో అట్టి మనుజుడు
చంపించునా! చంపగలడా! -21

ప్రాతచిరుగులు వదలి మనుజుడు
క్రొత్తబట్టలు తాధరించును
అదేవిధముగ ఆత్మ కూడా
శిథిలదేహాల్ విడిచిపెట్టును
నూత్నదేహాలందు జేరును. —22

ఆయుధాల్ ఛేదింపజాలవు
నిప్పురవ్వలు కాల్చజాలవు
నీరుతడుపదు, గాలికారదు
ఆత్మ నిత్యమ్మౌ. —23

అత్మకాలదు, చీలబడదోయ్
తడుపబడదెండింపబడదోయ్
సర్వగతమిది స్థాణు నిత్యము
సనాతన మచలమును స్థిరమున్ —24

ఆత్మ ఇంద్రియములకు అందదు
మనసు చింతన మునకుచిక్కదు
ఇదివికారము కలుగజేయదు
తెలిసి దుఃఖం వీడుమా! -25

ఆత్మ పుట్టును ఆత్మ చచ్చును
ఎప్పుడీస్థితి జరుగుచుండును
అని మనస్సున తలచికూడా
మహాభుజుడా! ఏడ్వగూడదు. —26

జననమొందిన చావుతప్పదు
చచ్చిపోయిన పుట్టుతప్పదు
తప్పశక్యము కానిదీనికి
దుఃఖమొందుట తగదు తగదోయ్ —27

జీవులాదిని కానిపించపు
మధ్యకనబడు చివరపోవును
పోయికనబడ వెంతమాత్రము
అట్టిదానికి వేదనెందుకు? —28

ఒకడు ఇది ఆశ్చర్యమని కను
ఒకడు ఇది ఆశ్చర్యమని విను
కనియు వినియును అనియు కూడా
తెలియలేదిది ఎవ్వరున్. —29

సర్వప్రాణుల దేహమందున
ఉన్న ఆత్మము చంపబడదోయ్
అందుకే ప్రాణులను తలచుచు
దుఃఖమేమరిపొందదగదోయ్. —30

అర్జునా! నీ స్వీయధర్మము
తలచి రణముకు జంకబోకుము
ధర్మయుద్ధము కన్నగొప్పది
క్షత్రియునకింకేది లేదోయ్. —31

అప్రయత్నంగానె లభ్యము
తెరచియుంచిన స్వర్గద్వారము
అయిన యుద్ధము చేయ క్షత్రియ
జనత సౌఖ్యము పొందు పార్థా! -32

ఇంక నీవీధర్మ యుద్ధము
చేయకుంటే మిన్నకుంటే
స్వీయధర్మ తిరస్కృతమ్మున
కీర్తిపోవును పాపమబ్బును. -33

మరియు లోకులు నీయకీర్తిని
చాలకాలము చెప్పుకొందురు
బాగ్రబదికిన వానికీచెడు
చావుకన్నా అధికమైనది. -34

ఏ మహారథులందు ఘనముగ
గౌరవమ్మిది వరకు పొందితొ
వారెచులకనజేసి చూతురు
రణభయమ్మిది యనితలంతురు. -35

శత్రువులునీ శక్తినందురు
అహితములనే వలుకుచుందురు
దాన్నిమించిన దుఃఖమెయ్యది
లోకాన గలదోయీ! -36

చచ్చిపోతే స్వర్గమబ్బును
జయముపొందితె రాజ్యసుఖములు
అందుకే యుద్ధంబుచేయగ
నిశ్చయమ్మొనరించి లేవోయ్! -37

సుఖముదుఃఖము లాభనష్టము
జయాజయములలో సమత్వము
ఉంచి యుద్ధము చేయబూనుము
దీనపాపము నీకు అంటదు. —38

సాంఖ్యమున వివరించి యుండిన
బుద్ధిచెప్పితి; కర్మబంధము
తెలిసి ముక్తుడ వీవుకాగా
చెబుదువిను పార్థా! —39

మొదలు పెట్టిన కాదు వ్యర్థము
మధ్యనాగితె లేదు దోషము
స్వల్పమైనా ఇట్టి ధర్మము
ఘనభయమ్ముల నుండి కాచును. —40

నిశ్చయముతో నుండుబుద్ధిని
ఉంచవలయును దీనివినగా
పలువిధాలనంతములనిశ్చ
యాత్ములవి బుద్ధులు —41

వేదములయర్థాల ప్రీతులు
స్వరఫలముల ఘనవచస్కులు
దృష్టి రమ్యమ్మయిన సుమములు
అల్పజ్ఞానులు వదరుబోతులు —42

కామచిత్తులు స్వర్గకాంక్షులు
జన్మకర్మల ఫలముభోగము
నందుకొనగా వైభవమ్ములు
వివిధక్రియలను జేయుచుందురు. —43

అర్థవాదము చేతమనసులు
చెడినవ్యక్తులు కామసక్తులు
కాన దైవధ్యానమందున
నిశ్చయాత్మక బుద్ధి నిగుడదు. -44

వేదములుత్రి గుణాల విషయాల్
తెలుపు; ద్వంద్వము వదలుత్రిగుణాల్
శుద్ధసత్త్వము నాశ్రయించుము,
యోగక్షేమాలంద దృష్టిని
నిలిపిజ్ఞానివికా -45

బావి నీరుపయోగమెంతో
జలములన్నియు నంతియేయగు
వేద ప్రయోజనము ఎంతో
బ్రహ్మమెరిగిన అంతెమోదము 46

కర్మచేయగ హక్కు ఉన్నది
కర్మఫలితము కోరలేదోయ్
కర్మఫలమున కాకుహేతువు
కర్మ మానక ఉండుగాక। 47

యోగ నిష్ఠను వీడుసంగము
ఫలము దొరికిన దొరకకున్నా
సమసుబుద్ధిని కర్మచేయుము
అట్టి సమతయె యోగమనబడు -48

కర్మనిష్కామమునకన్నా
కామ్యకర్మము తక్కువేకద
సమతబుద్ధినె యభిలషింపుము
ఫలము గోరెడు వారు దీనులు —49

బుద్ధియుక్తుడు పుణ్యపాపాల్
ఇహములోనే విడుచు చుండును
కాన దానికి పూనుకొమ్మిక
కర్మకౌశలమగును యోగము —50

ఘనమనీషులు బుద్ధియుక్తులు
కర్మఫలముల వదలివేతురు
జన్మబంధము నుండి విడివడి
దుఃఖరహితమోక్ష మందుదురు —51

పార్థ! నీదగు బుద్ధి ఎప్పుడు
మోహమాలిన్యమును దాటునొ
వినిన వినియెడు దాని యందున్
నీవు నిర్వేదమున నుందువు -52

ఎన్నియోవిని కలత చెందిన
నీ మనసు ఎపుడచలమగునో
సమాధియందు నిల్చియుండునొ
యోగమప్పుడు పొందగలవు —53

*** అర్జునుడప్పుడిలా అడిగాడు:-**

సమాధిలోని స్థితప్రజ్ఞుని
లక్షణంబేమి! ఏమిపలుకును
ఏవిధంగా ఉండునాతడు
సంచరించు నదెట్టులన్ -54

*** శ్రీభగవానుడిలా అన్నాడు:-**

మనసులోగల సర్వకాంక్షలు
వదలివేసియు నాత్మయందే
ఆత్మతుష్టిని పొందునాతడు
స్థితప్రజ్ఞుండనంబడును -55

దుఃఖాల చెదరని మనస్కుడు
కోరికలేమియు సుఖములందున
రాగభయ క్రోధాది రహితుడు
మనన శీలుడు స్థిత ప్రజ్ఞుడు -56

సర్వవిషయాలందసంగుడు
ప్రియా ప్రియముల యందుతోషము
ద్వేష భావము పొందకుండునా
అతని ప్రజ్ఞే సుస్థిరం -57

కూర్మమంగాల్ ముడుచునట్టుల
ఇంద్రియార్థేంద్రియములను తా
విషయముల మరలించువాడే
స్థిర ప్రజ్ఞుడు స్థిత ప్రజ్ఞుడు -58

విషయముల విడనాడు వానికి
తొలగు విషయాల్, వాసనుండును
ఎపుడు పరమము నతడుచూచునా
విషయవాసన అపుడు తొలగును -59

ఇంద్రియమ్ములు శక్తిమంతులు
ఆత్మజ్ఞాని మనస్సుకూడా
కలత పెట్టును, శక్తిలో మరి
లాగుకొనునయ్యా! -60

సంయముండై స్థిరమనస్కుడు
మనసునాపై ఉంచవలయును
ఎవరి కింద్రియములు వశమ్ములో
అతనిజ్ఞానమె సుస్థిరమ్మా! -61

విషయచింతనుడైన మనిషికి
వానియందా సక్తి కలుగును
అందువల్లనె కోర్కి కలుగును
కోర్కివలననె పుట్టుకోపము. -62

కోపమున అవివేకుడవ్వును
అవివేకమున మరపు పుట్టును
మరపువల్లనె బుద్ధినాశము
బుద్ధినాశమె సర్వనాశము. —63

కానిసంయమి, ద్వేషరాగము
లందు రహితుడు, విధేయాత్ముడు
ఇంద్రియమ్ముల తోడ విషయాల్
అనుభవించియు శాంతి పొందును —64

చిత్తశాంతిని పొందు మనుజుని
దుఃఖనాశన మగుచునున్నది
చిత్తనిర్మలుడైన వ్యక్తికి
బుద్ధిశీఘ్రమె స్థిరమ్మగును. -65

అనిగ్రహునకు బుద్ధిశూన్యము
చింతనమ్మె సంభవించదు
అచింతనునకు శాంతి కలుగదు
శాంతిలేనిచొ ఎచటసుఖము? —66

విషయవర్తిత ఇంద్రియాలలొ
మనసుదేనిని అనుసరించునొ
నీటఓడను గాలివలెనే
అద్దిప్రజ్ఞను అపహరించును. -67

ఇంద్రియాలను విషయములపై
వెళ్లనివ్వక సర్వవిధముల
ఎవ్వడాపునో అతని జ్ఞానము
సుస్థిరమ్మోయీ! -68

ఎల్లప్రాణుల కేదిరాత్రో
అందు సంయమి మేలుకొంటడు
ప్రాణులెందున మేలుకొంటరో
అది మునీంద్రుకు రాత్రి అవుతది. -69

నిండ ఉండిన జలధిలోనికి
నదీ జలములు చేరునెట్లో
భోగ్యవిషయములదేవిధముగ
బ్రహ్మనిష్ఠునిపొంది అణగును
శాంతిపొందును అతడు విషయా
సక్తి పొందడుగా! -70

సర్వకాంక్షలవిడుచువాడే
ఆశవీడియు నడచువాడే
నిర్మముండై అహములేకయు
నడచువాడే శాంతి పొందును. -71

ఇద్దిబ్రాహ్మ స్థితిర పార్థా!
పొందదీనిని మోహమందడు
అంత్య కాలమ్మందు ఇట్లే
నిలిచి ఉంటే మోక్ష మందును. -72

* ఉపనిషత్ప్రతిపాద గీతము
బ్రహ్మవిద్యయు యోగశాస్త్రము
కృష్ణనరసంవాద తత్త్వము
సాంఖ్యయోగంబు!

ఓం శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీభగవద్గీత

## మూడవ అధ్యాయం

## కర్మయోగం

*** అర్జునుడు అడిగాడు:-**

కర్మకన్నా జ్ఞానమధికము
అనితలంపే అయిన ఎందుకు
ఘోరమగునీ కర్మయుద్ధము
చేయుమందువు కేశవా! —1

మిశ్రవాక్యము భంగినుండిన
మాటచెప్పుచు కలతపెట్టెదు;
కానశ్రేయము దేనివలనన్
పొందగలనో చెప్పుకృష్ణా! —2

*** శ్రీ భగవానుడు ఇలా చెప్పాడు:-**

పాపరహితా! పూర్వమిచ్చట
సాంఖ్య జనులకు జ్ఞానయోగము
యోగిజనులకు కర్మయోగము
నిష్ఠలన్నీ చెప్పబడ్డవి. —3

కర్మమనుజుండాచరించక
నిష్క్రియాత్మస్థితిని పొందడు
కర్మత్యాగము చేసినంతన
మోక్షసిద్ధికి ఎవడు అందడు. —4

కర్మ చేయక నిమిషమైనను
ఎవ్వడుండడు; ప్రకృతి గుణముల
వలన అందరు అవశులగుతూ
కర్మలను చేస్తారు పార్థా! -5

అణచి కర్మేంద్రియము, లింద్రియ
విషయచింతన మనసు చేస్తే
మూఢచిత్తుండాతడవ్వను
అగును మిథ్యాచారుడున్. -6

ఎవడు ఇంద్రియములను మనసుతో
కట్టివేసియు కర్మయోగము
నందుసంగము లేనివాడై
ప్రవర్తించిన ఉత్తముండగు. -7

నీవు నియమిత కర్మ చేయుము
కర్మ చేయక ఉండు కంటే
చేయ శ్రేష్ఠము; కర్మ చేయక
దేహయాత్రయె సాగదోయీ! -8

పార్థ! యజ్ఞ సుకర్మ కంటెన్
మరో కర్మము లోకబంధమె
కాన ఫలమున కాంక్షలేకయె
యజ్ఞకర్మాన్నాచరించుము. -9

అజుడు పూర్వం యజ్ఞములతో
ప్రజల జేసెను పలికెనిట్టుల
వృద్ధిపొందుడు వీటివలనన్
కాంక్షలన్నీ తీర్చుగాక -10

తృప్తిపరచుడు దేవతాతతి
తృప్తి పరతురు వారు మిమ్ముల
పరస్పరముగ తృప్తినొందుట
పరమశ్రేయము లభ్యము. -11

యజ్ఞతృప్తిని పొందివారలు
మనకు ఇచ్చిన అన్నమివ్వక
ఎవడుతినునో వాడుదొంగగు
ఇది నిజము సుమ్మయ్యా! -12

యజ్ఞమున శేషాన్న భాగము
తిన్నవాడే పాపముక్తుడు
తమనిమిత్తమె తిన్న వారలు
పాపమే తిన్నట్లు అగును! -13

ప్రాణులన్నము వలన కలుగును
అన్నమో మరి మొగులు వలనన్
మేఘమేమో యజ్ఞజంబది
యజ్ఞమగు సత్కర్మ వలనన్. -14

వేదములచే కర్మకలుగును
వేదమక్షర బ్రహ్మచేతగు
కనుక బ్రహ్మము సర్వవ్యాప్తము
యజ్ఞమందది ఉండునెరుగుము. -15

పార్థ! ఇది ధర్మంపు చక్రము
దీనినెవ్వడు అనుసరించడొ
అతడుపాపుడు విషయలోలుడు
అగుచు వ్యర్థము బ్రతుకు బ్రతుకును. -16

ఆత్మయందే రతిని సలుపుచు
ఆత్మయందే తృప్తిపొందుచు
ఆత్మయందే సంతసించిన
ఆత్మవేదికి పనేలేదు. —17

అట్టివ్యక్తికి కర్మచేయగ
అవనిలో ఫలితమ్ము లేదోయ్
చేయకున్నా దొసగులేదోయ్
భూతకోటిని ఆశ్రయించడు. -18

కానసంగము వదలి సతతము
చేయుకర్మను చేయుచుండుము
సంగరహితుండై మనుష్యుడు
కర్మచేసిన మోక్షమందును. —19

కర్మనిష్కామంబు వలననె
జనకుడాదిగ మోక్షమందిరి
జనులచక్కని పథము ద్రిప్పగ
కర్మచేయుట కీవు తగుదువు. —20

శ్రేష్ఠుడే కర్మంబు చేయునొ
ఇతర జనులును చేతురదియే
అతండేది ప్రమాణమనునో
అందరదియే అనుసరింతురు. —21

పార్థ! నాకీత్రిలోకాలను
పొందబడనిది, పొందదగినది
చేయదగినది ఏదిలేదోయ్!
అయిన కర్మను చేయుచుంటిని. -22

జాగరూకుడ నగుచుకర్మన
నేను నడవక ఉన్న పార్థా!
అన్నిరీతుల జనులు నన్నే
అనుసరించెదరూ! —23

నేను కర్మను చేయకుండిన
ప్రజలు చెడుదురు, సంఘసంకర
మునకునేనే కర్తనగుదును
ప్రజల చెరిపిన వాడనగుదును. —24

పార్థ! మూర్ఖులు తగిలి కర్మల
ఫలాపేక్షను చేయుచుందురు
అలాజ్ఞానులు కాక లోకము
మంచికొరకే చేయవలయును. —25

ఫలాసక్తుల జ్ఞానబుద్ధుల
చెదరగొట్టగ రాదు విజ్ఞుడు
యోగయుక్తుండై యొనర్చుచు
వారిచే చేయించ వలెనోయ్. —26

ప్రాకృతాలగు సత్త్వరజములు
తమముతో ఇవి యన్ని జరుగగ
అహంకార జ్ఞానశూన్యుడు
తానెకర్తనుగా తలంచును. —27

గుణముకర్మల విభజనజ్ఞుడు
తత్త్వమెరిగిన వాడు పార్థా!
గుణములేయిల గుణములందున
నడచునని సంగమును పొందడు. —28

ప్రకృతి గుణముల మోహాలవ్వుచు
గుణాసక్తులరగుచు నడచిన
అల్పజ్ఞులను మందమతులను
జ్ఞాని చలితుల జేయగూడదు. -29

చిత్తమధ్యాత్మమ్ము నుండగ
నాకుకర్మములన్ని అర్పణ
చేసి, ఆశయు మమత లేకనె
చింతవీడుము రణము చేయుము. -30

శ్రద్ధతో అనసూయులై జను
లెవరు ఎప్పుడు మమమతమ్మును
అనుసరింతురొ వారు కర్మల
బంధముక్తులు అవుదురయ్యా! -31

దీనినేద్వేషించి నన్నే
అనుసరించక ఉండువారలు
బుద్ధిహీనులు జ్ఞానశూన్యులు
చెడిన వారలుగా నెరుంగుము. -32

జ్ఞాని తనదగు ప్రకృతి కనుగుణ
ముగనె నడచును, ప్రాణులేమో
తమదు ప్రకృతిని అనుసరించును
నిగ్రహంబిక ఏమిచేయును. -33

ఇంద్రియేంద్రియ విషయమందున
ద్వేషరాగములున్న వేర్పడి
వాటికెవరును లొంగకూడదు
అవ్వి మనిషికి శత్రులే కద! -34

స్వనుష్ఠితమగు పరులధర్మము
కన్న విగుణపు స్వీయధర్మము
మేలు; మరణమ స్వధర్మమ్మున
మేలు; భయదము పరుల ధర్మము. -35

* అర్జునుడు అప్పుడిలా అడిగాడు:-

అయినకృష్ణా! మనిషిపాపము
చేయవలెనని కోరకున్నా
బలాత్కారముగాను చేయుట
కేది ప్రేరణ చెప్పుమా! -36

* శ్రీ భగవానుడిలా సమాధానమిచ్చాడు:-

రజోగుణభవమైన కామము
కారణమ్మగు; క్రోధమగునది
తృప్తిపొందదు పాపహేతువు
మోక్షమార్గమునందు శత్రువు. -37

ధూమమగ్నిని, మురికి ముకురము
మావిగర్భమునందు శిశువును
కప్పియుండిన కరణి కామము
ఆత్మజ్ఞానము నావరించును. -38

నింపశక్యము కాని అగ్నిది
తృప్తిచెందదు, ఆశరూపము
జ్ఞానిశత్రువు, ఇట్టి కామము
జ్ఞానమునే ఆవరించును. -39

ఇంద్రియంబులు మనసుబుద్ధియు
దీని కాశ్రయ మనుచు చెబుదురు
వీనిచేతనె ఆత్మజ్ఞానము
కప్పబడి మోహమ్ము నింపును. -40

అందుకేమరి ఇంద్రియాదుల
నిగ్రహించుము, జ్ఞాన విజ్ఞా
నమ్ము నాశని పాపి కామము,
పూర్తిగావదలోయి పార్థా! —41

ఇంద్రియాలును మనసు బుద్ధియు
ఒకటికంటే ఒకటిగొప్పే!
బుద్ధికంటే ఏదిగొప్పో
అదే ఆత్మని ఋషులు అందురు. -42

ఇలా బుద్ధినిమించు నాత్మని
బుద్ధితోనీ మనస్స్నాపుము
దురాసదమగు కామశత్రువు
నోడగొట్టుము భారతా! —43

* ఉపనిషత్ప్రతిపాదగీతము
బ్రహ్మవిద్యయు యోగశాస్త్రము
కృష్ణనరసంవాద తత్త్వము
కర్మయోగంబు!

*

ఓం శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీభగవద్గీత

## నాల్గవ అధ్యాయం

## జ్ఞానయోగం

*** శ్రీ భగవానుడు ఇలా అన్నాడు:-**

నాశరహితం బట్టి యోగము
సూర్యునకునే చెప్పితెప్పుడొ:
మనువునకునాతండు చెప్పెను
మనువు ఇక్ష్వాకునకు చెప్పెను. —1

పరంపరగా ప్రాప్తమియ్యది
ఇదే రాజర్షులు గ్రహించిరి
చాలకాలము గడిచినందున
అట్టియోగమదృశ్యమైనది, —2

నాకుభక్తుడవీవు సఖుడవు
పురాతనమిది నీకు చెప్పితి
శ్రేష్ఠమియ్యది అతిరహస్యము
చిత్తముంచుము అర్జునా: —3

*** అర్జునుడు ఇలా అడిగాడు:-**

నీమజన్మము నిన్నినిన్నా
సూర్యుజన్మము మొన్నమొన్నా
మొదటచెప్పా నన్న సంగతి
అర్థమెట్టుల అవ్వనయ్యా: —4

*** శ్రీ భగవానుడు వివరించాడు:-**

నీకునాకును జన్మలెన్నో
గడిచిపోయిన వయ్యపార్థా!
అట్టిజన్మలు నేనెరుంగుదు
నీవెరుంగవు సుమ్ముపార్థా! -5

నేను అజుడను అవ్యయుండను
సర్వప్రాణుల కీశ్వరుండను
అయిననూ ప్రకృతికిని వశమై
మాయచేతనె సంభవింతును. -6

ఎప్పుడెప్పుడు ధర్మహానియు
అధర్మంబభి వృద్ధియగునో
అప్పుడప్పుడు నన్ను నేనే
సృష్టించుకొనుచున్నా! -7

శిష్టజనులను రక్షసేయగ
దుష్టజనులను త్రుంచివేయగ
ధర్మసంస్థాపనము చేయగ
యుగయుగంబున సంభవింతును. -8

ఎవ్వడీనాదివ్య జన్మము
దివ్యకర్మము నిజమునెరుగునో
అతను చచ్చియు మరల జన్మము
పొందబోడిక నన్నుపొందును. -9

వీతరాగులు భయక్రోధులు
మన్మనస్కులు మదాశ్రితులును
జ్ఞానతపసు పవిత్రజనులై
నాస్వభావము పొందిరయ్యా! -10

ఎవరెట్లు నను సేవచేతురో
వారినట్లె అనుగ్రహింతును
సర్వవిధముల మమపథమ్మును
ఆనుసరించుచు నుంద్రి మనుజులు. —11

కర్మఫలితముకోరి మనుజులు
పూజచేసిరి దేవతలనిట
ఏలయనగా కర్మఫలితము
కలుగువెంటనె మనుజ జగతిన్. -12

గుణము కర్మము విభాగమ్ముగ
నాల్గువర్ణము లేనుజేసితి
నేనువాటికి కర్తనైనా
కానుకర్తను, నాశరహితుడ. -13

కర్మలంటవు నన్ను, నాకున్
కర్మఫలమున లేదుకోరిక
నన్ను ఇట్టుల ఎవడెరుంగునొ
కర్మబంధితుడతడు కాడోయ్. —14

ఇలా తెలుసుక పూర్వమెందరో
ముముక్షువులును కర్మచేసిరి
కనుకపూర్వులు చేసియుండిన
పూర్వకర్మనె చేయుమర్జున. -15

ఏదికర్మము ఏదకర్మము
కవులు తెలియక మోహమందిరి
ఏదితెలిసిన అనర్థములకు
దూరమవుదువొ, అదేచెబుతా. -16

ఏదికర్మము ఏదకర్మము
ఎదివికర్మము, కర్మతత్త్వము
పూర్తిబాగుగ తెలిసికోవలె
అందదది లోతైనదయ్యా! —17

ఎవడుకర్మమునందకర్మము
ఆయకర్మములోన కర్మను
చూచునో-ఆతండు బుధుడగు
పూర్ణకర్ముండగును యుక్తుడు. —18

ఎవరికర్మలు ఎవరికోర్కులు
సంకల్ప వర్జితములగునో
అతడు జ్ఞానమ్మనెడు అగ్నిని
దహితకర్ముడు; పండితుండగు. -19

కర్మఫల సంగమ్ము వదలియు
నిత్యతృప్తుడు నిరాశ్రయుడును
అగుచు కర్మల ప్రవర్తించిన
కర్మచేయని వాడెయగును. -20

ఆశరహితుడు జితేంద్రియుడును
తాను అపరిగ్రహుడు అయితే
దేహమునకై కర్మ చేస్తే
అతడుపాపము పొందబోడోయ్. —21

అప్రయత్నపు లభ్యతుష్టుడు
ద్వంద్వమత్సరములకతీతుడు
ప్రాప్తి అప్రాప్తముల సముడు
కర్మచేసిన బంధరహితుడు. -22

సంగరహితుడు బంధముక్తుడు
స్థితజ్ఞాన ప్రచేతసుడును
ధర్మకర్ముడు అయిన మనుజుని
కర్మలన్నీ లీనమవ్వను. -23

హోమద్రవ్యాల్ సాధనమ్ములు
అగ్నిహోమము చేయువాడును
చేయబడినది అన్ని బ్రహ్మలె
అనెడి భావుకుడగును బ్రహ్మము. —24

దైవయజ్ఞము నాచరింతురు
యోగివర్యులు, కొందరేమో
జీవమును బ్రహ్మమ్ము ఒకటని
జీవునే బ్రహ్మాగ్ని వేతురు. -25

చెవియు తదితర ఇంద్రియాదుల
నిగ్రహాగ్నుల వ్రేల్త్రు కొందరు
శబ్దముల విషయాలు కొందరు
ఇంద్రియాగ్నుల వ్రేల్చుచుందురు. -26

ప్రాణకర్మల మఱియు ఇంద్రియ
కర్మలన్నిటినేమొ కొందరు
జ్ఞానదీపిత ఆత్మసంయమ
యోగాగ్నిలో వ్రేల్చుచుందురు. —27

ద్రవ్యయజ్ఞము తపోయజ్ఞము
యోగయజ్ఞము చేతురెందరొ
వేదవిదులగు జ్ఞానులీరలు
యత్నశీలురు దృఢవ్రతులును. -28

ప్రాణయామము చేయుకొందరు
ప్రాణాపాన గతులగట్టుచు
ప్రాణవాయువునందపాన మ
పానమందు ప్రాణము చేసిరి. -29

నియతముగ భుజియించు కొందరు
ప్రాణముల ప్రాణముల వ్రేల్తురు
వీరలందరు యజ్ఞవేత్తలు
యజ్ఞముల నిర్మూల పాపులు. —30

యజ్ఞశేషమ్మమృతాన్నము
తిన్నవారలు బ్రహ్మప్రాప్తులు
యజ్ఞరహితుని కిహమునందున
సుఖముసున్నా! పరమునెక్కడ! -31

ఇలాయజ్ఞములున్న వెన్నో
వేదములలో తెలుపబడ్డవి
అవ్వికర్మజములుగ నెరుగుము
ఇట్లెరింగిన ముక్తిపొందుదు. 32

జ్ఞానయజ్ఞము ద్రవ్యయజ్ఞము
కన్న శ్రేష్ఠము; ఎందుకనగా
కర్మలెవ్వియు నాశమొందక
జ్ఞానమందే ఇమిడియున్నవి. -33

తత్త్వవేత్తలునైన జ్ఞానుల
కీవు ప్రణతులుచేసి, నయముగ
అడిగి, సేవలుచేసి ఎరుగుము
వారుతప్పక చెప్పగలరోయ్. -34

ఎది గ్రహించిన ఇట్టి మోహము
పొందకుందువో పార్థ! దానినె
సర్వప్రాణుల నీలోనాలో
చూడగలవో అది గ్రహించుము. -35

పాపులెల్లర మించిపాపము
నీవుచేసిన వాడవైనా
అట్టిపాప సముద్రమంతా
జ్ఞానప్లవనముచే తరింతువు. -36

పార్థ! రగిలిన అగ్నికట్టెల
నెట్లు బూడిద చేయగలదో
జానమనునా అగ్నియట్టులె
సర్వకర్మల చేయుభస్మము. -37

ఇచటజ్ఞానసమానమైన-ప
విత్రమెయ్యది లేదు పార్థా!
అట్టియోగస్థితిని పొందిన
వాడుతనలో పొందు వరుసగ. -38

సంయతేంద్రియుడైన నిష్ఠుడు
శ్రద్ధగలమనుజుండు పొందును
జ్ఞాన, మట్టుల పొంది శీఘ్రమె
పరమశాంతిని బడయునయ్యా! -39

జ్ఞానహీనుడు శ్రద్ధ రహితుడు
సంశయాత్ముడు పొందునాశము
సంశయాత్ముని కిహపరమ్ముల
సుఖము సున్నయ్యా! -40

కర్మ నిష్కాముండు తానై
యోగి అయితే, జ్ఞాన భేదిత
సంశయుండగు నాత్మనిష్ఠుని
కర్మలును బంధించ జాలవు. —41

మనసులో అజ్ఞాన జనితపు
సంశయంబును జ్ఞానఖడ్గము
చేతద్రుంచు మొనర్చుయోగము
లేరభారత వీరుడా! -42

* ఉపనిషత్ప్రతి పాదగీతము
బ్రహ్మవిద్యయు యోగశాస్త్రము
కృష్ణనరసంవాద తత్త్వము
జ్ఞానయోగంబు!

*



ఓం శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీభగవద్గీత

## అయిదవ అధ్యాయం

## కర్మ సన్న్యాసయోగం

*** అర్జునుడు అడిగాడు:-**

నీవొకప్పుడు కర్మత్యాగము
ఇంకొకప్పుడు కర్మయోగము
ప్రస్తుతింతువు; రెంటశ్రేయ
మ్మేదొచెప్పుము కృష్ణమూర్తీ! 1

*** శ్రీ భగవానుడిలా చెప్పాడు:-**

కర్మయోగము కర్మత్యాగము
రెండుకూడా మోక్షమిస్తవి
కర్మయోగము కర్మత్యాగము
కంటె శ్రేష్ఠంబందునన్. -2

దేనిపైద్వేషమ్ము పొందక
దేనికోరక ఉన్న సన్న్యా
సయ్యెప్పుడు, ఎందుకంటే
ద్వంద్వ రహితుడు బంధముక్తుడు. -3

జ్ఞానకర్మలు వేరువేరని
అజ్ఞులంటరు; విజ్ఞులనరోయ్!
రెంట ఒక్కటి లెస్సచేస్తే
రెంటి ఫలితము వస్తదోయ్! -4

సాంఖ్యజనులకు దొరకుస్థానమె
యోగిగణముకు దొరకునయ్యా!
సాంఖ్యకర్మము లొకేవిధముగ
చూచువాడే చూచువాడగు. —5

కర్మయోగములేక సన్న్యా
సమ్ము నందుట మిగుల కష్టము
యోగయుక్తుండైన సంయమి
పొందుబ్రహ్మము శీఘ్రమే. —6

యోగయుక్తుడు విశుద్ధాత్ముడు
జితేంద్రియుడును జితాత్ముండును
సర్వభూతములందు తనలో
ఆత్మ ఒకటవ కర్మలంటవు. —7

యోగయుక్తుడు, శుద్ధహృదయుడు
కనియు, వినుచును, తాకి, వాసన
చూచి, తినుచును, కదలి, గాలిని
విడిచి, నిదురను ఉన్న ఒకటే. —8

పలికిన,విడిచిన, గ్రహియించినా
కనులు తెరచిన, మూయుచున్నా
ఇద్ది ఇంద్రియ విషయ వర్తన
మనును; కర్తగ నెంచడోయ్. —9

చేయుకర్మల బ్రహ్మకర్పణ
చేసి సంగము విడిచి నడచిన
అతనికిక పాపమ్ము అంటదు
నీరు తామరపాకువలెనే. —10

చిత్తశుద్ధికి యోగి వర్యులు
నిస్సంగులై; మనసు దేహము
బుద్ధిచేతను, నిరభిమానపు
ఇంద్రియాలన్ కర్మచేతురు. -11

కర్మఫలమును విడిచి యుక్తుడు
ఆత్మనిష్ఠిత శాంతిపొందును
కర్మఫలమున కైయయుక్తుడు
ఆశచేతనె బద్ధుడవ్వును. -12

సర్వకర్మల సన్యసించియు
మానసికముగ, చేయకను చే
యించకుండా, నవద్వారపు
నగరదేహముతో సుఖించును. -13

కర్మకర్తృత్వమ్ము ఫలముల
బంధములు జీవులకు దేవుడు
ఇవ్వడయ్యా! స్వభావమ్మే
ప్రవర్తించు వినుమయ్యా! -14

ప్రభువు ఎవ్వరి పాపపుణ్యాల్
స్వీకరించనె స్వీకరించడు
జ్ఞానమజ్ఞానమ్ము గప్పెను
జీవులందుకె భ్రమను పొందిరి. -15

ఆత్మజ్ఞానము వలన అజ్ఞత
నాశమైతే, వారిజానము
సూర్యసదృశమై వరమ్మును
కాంతివంతము చేయును. -16

అతని పైమరి బుద్ధిమనసును
నిష్ఠపెట్టియు గతిగవెంచియు
జ్ఞానమున పాపమును గొట్టియు
జన్మరహిత విముక్తి గాంతురు. –17

విద్యవినయములున్న విప్రుడు
కరిశ్వానము గోవు శ్వపచుడు
వీటిపైసమదృష్టి ఉండిన
వారె జ్ఞానులుగా గ్రహించుము. –18

ఎవరిమనసిట సమస్థితమో
వారు జితసంసారు లగుదురు
దోషరహితము సమముబ్రహ్మము
కనుక బ్రహ్మము నందు నిలుతురు. –19

స్థిరమనస్కుడు మోహరహితుడు
బ్రహ్మస్థిత బ్రహ్మజ్ఞానుడు
ప్రియంబబ్బిన ముదముపొందడు
అప్రియానికి దుఃఖమందడు. –20

బాహ్యస్పర్శములందరాగుడు
ఆత్మయందలి సుఖమెపొందును
బ్రహ్మనిష్ఠిత ఆత్మయుక్తుడు
అక్షయమ్మగు సుఖము పొందును. -21

విషయ సంయోగంబు వలనన్
కలుగు సుఖములు దుఃఖదమ్ములు
అల్పకాలంబుండు కనుకనె
బుధుండాడడు అందుపార్థా! -22

విడవడానికి మున్నె దేహము
ఇచట కామము క్రోధభవమును
అయినవేగము నాపుయోగే
సుఖుండగు పార్థా! —23

ఆత్మసుఖియై ఆత్మరతుడై
ఆత్మలో వెలుగొందు యోగే
బ్రహ్మరూపుండగును, బ్రహ్మమె
పొందుచుండునుగా. —24

పాపరహితులు అసంశయులును
జితేంద్రియులును సర్వజీవుల
హితాసక్తులు నియత ఆత్ములు
బ్రహ్మము పొందుతున్నారోయ్! —25

నిగ్రహాత్ములు ఆత్మతత్త్వులు
కామముసుక్రోధముల త్యక్తులు
అయిన యతులకు బ్రహ్మపదమది
వెలయుచున్నది అంతటన్. —26

బాహ్యస్పర్శాల్ బయట కంపుచు
బొమల మధ్యనె చూపు నిలుపుచు
నాసికాసంచార ప్రాణా
పానవాయువు సమముజేసియు. —27

మనసు బుద్ధియు నింద్రియమ్ముల
నిగ్రహించి, భయమ్ము కోరిక
లేకక్రోధము, ముక్తికాంక్షతో
ఉన్నమునియే నిత్యముక్తుడు. —28

యజ్ఞతపసులకేను భోక్తను
ఎల్ల జగతికి ఈశ్వరుండను
సర్వజీవుల శుభాకాంక్షిని
ననుగ్రహించిన పొందుశాంతిని.

* ఉపనిషత్ర్పతి పాద గీతము
బ్రహ్మవిద్యయు యోగశాస్త్రము
కృష్ణ నరసంవాద తత్త్వము
కర్మసన్యాస యోగంబు.



ఓం శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీభగవద్గీత

## ఆరవ అధ్యాయం

## ఆత్మసంయమ యోగం

*** శ్రీ భగవానుడు ఇలా అన్నాడు:-**

కర్మఫలితము కాంక్షచేయక
నియతకర్మము చేయువాడే
అగును సన్న్యాసియును యోగియు
నిరగ్నుండ క్రియుడు కాడు. -1

ఏదిసన్న్యాసమని యందురో
అదేయోగం బనియెరుంగుము
ఏలయన సంకల్ప రహితుడు
కాక ఎవడును యోగికాడోయ్. 2

యోగమెక్కఁగ తలచుమౌనికి
కర్మసాధన మగును; దానిని
ఎక్కువానికి శమము సాధన
మనియు చెప్పంబడినది. -3

ఇంద్రియార్థము లందుకర్మల
యందునెప్పుడు తగులకుండుచు
సర్వసంకల్పముల విడుచునా
అతడు యోగారూఢుడందురు. 4

తనకుతానే ఉద్ధరించుక
ఉండవలయును; వలదధోగతి
ఎందుకంటే తనకుతానే
చుట్టమవ్వును శత్రువవ్వును. -5

తన మనస్సును తానుగెల్చిన
అట్టిచిత్తము బంధువేయగు
గెల్వనప్పుడు అట్టిచిత్తము
శత్రువేయగును. -6

శాంతియుతునకు జితాత్మునకును
శీతముష్ణము సుఖము దుఃఖము
మానమవమానముల పరమా
త్మానుభావము చెదరకుండును. -7

జ్ఞానవిజ్ఞానముల తృప్తుడు
నిర్వికారుడు జితేంద్రియుడును
మట్టి స్వర్ణము రాఋసమముగ
చూడయోగారూఢుడందురు. -8

సుహృన్మిత్రులు, అరులుద్వేష్యులు
ఉదాసీనులు మధ్యవర్తులు
బంధువులు సాధువులు పాపుల
సమత బుద్ధుడే శ్రేష్ఠుడు. -9

యోగి ఒంటరియై మనస్సును
ఇంద్రియంబుల కట్టి పెట్టియు
ఆశ విడిచియు స్వీకరింపక
మనసునాత్మను నిలుపుకోవలె. -10

హెచ్చుతగ్గులులేక సమమగు
శుచిస్థానము దర్భచాపయు
పైన చర్మము దానవస్త్రము
కదలకుండా పైనపీఠము. 11

వేసికూర్చొని మనసునిల్పియు
యతచిత్తేంద్రియుడు క్రియుడై
ఆత్మశుద్ధికి ధ్యానయోగము
అభ్యసించగవలయును. —12

మేనుశిరమును గళము సమముగ
నిలిపి స్థిరముగ నున్నవాడై
దిశలచూడక, నాసికాగ్రము
పైనచూపును నిలిపి పిదపన్. — 3

ప్రశాంతాత్మను విగతభయుడై
బ్రహ్మచారై వ్రతస్థితుడై
సంయముండై మత్పరుండై
మచ్చిత్తుడై యుక్తుడుండున్. -14

నియతమానసుడైన యోగియు
మనసు నాత్మధ్యాన మందున
నిల్పి, నాలోనగల నిర్వా
ణపరమ శాంతిపొందును. —15

బాగతిన్నా తినక ఉన్నా
పండుకొన్నా పండకున్నా
ఏది ఎక్కువ ఉన్నగానీ
యోగమందదు సుమ్ముపార్థా! —16

మితాహారము మితవిహారము
కర్మలను మితవర్తనమ్మును
మితమునిద్ర, మితజాగరణము
ఉన్నయోగము దుఃఖహననము -17

ఎపుడు చిత్తము వినియతంబై
ఆత్మయందే నిలుచుచున్నదొ
యోగికోరిక లెపుడు విడుచునొ
యోగసిద్ధుండప్పుడందురు -18

గాలివీచని చోటదీపము
ఎట్లుకదలక నిల్చియుండునొ
అట్లె ఆత్మధ్యానయోగికి
నిశ్చలమ్మగు నియత చిత్తము -19

యోగబద్ధిత చిత్తమెచ్చట
పరమ శాంతిని పొందు చుండునొ,
ఎచట మనసుతొ ఆత్మచూచిన
యోగి సంతసమందుచుండునొ -20

ఇంద్రియాలకు అద్ది అందదు
బుద్ధికందదు, అంతమందని
సుఖానుభవము పొందుచుండునొ
స్వానుభవమున కదలకుండునొ -21

ఏదిలభ్యంబైన యితరము
గొప్ప లాభముగా తలంచడొ
ఎచటనిల్చిన తీవ్రదుఃఖము
వలన చలనము పొందుకుండునొ -22

అట్టి దుఃఖము లేశమైనా
లేని స్థితియే యోగమెరుగుము
అట్టియోగము కలతచెందని
ధీరమనమున పొందదగినది -23

పుట్టుసంకల్పాన కాంక్షలు
విడువవలయును, మనసుతో పరు
గెత్తు ఇంద్రియములను గట్టిగ
నిగ్రహించియునున్ -24

ధీరబుద్ధిని మెల్లమెల్లగ
ఉపశమనమును పొందవలయును
ఆత్మలోనే మనసు నిలిపియు
ఇతరమైనవి తలచకూడదు. -25

చంచలము అస్థిరము మనసును
సంచరించే స్థలము మలిపియు
ఆత్మలోనే నిలువవలయును
ఆత్మకువశము చేయవలయును. -26

శాంతచిత్తుడు రజోరహితుడు
బ్రహ్మభూతుడ కల్మషందగు
ధ్యానయోగిని ఉత్తమంబగు
సుఖమే అందుచున్నదిగా -27

ఇలామనసును ఆత్మలోనే
ఎపుడునిలిపెడ కల్మషండగు
యోగియేబ్రహ్మాదు భవమను
పరమ సుఖమును పొందుతున్నడు. -28

యోగయుక్తంబైన ఆత్ముడు
సర్వభూతములందు గలనని
సర్వప్రాణులు తనలో గలవని
సమదృష్టిని వ్యవహరించును. -29

సర్వప్రాణుల నన్నుచూస్తూ
సర్వప్రాణుల నాలోచూస్తూ
ఉన్న కనబడకెట్లు ఉండెద
నాకు కనబడకెట్లు ఉండును. -30

సర్వభూతము లందునుండిన
నన్నభేదముగను భజించునో
అతని నడవడి ఎట్టిదైనా
యోగినాలో ఉన్నవాడగు. -31

ఎల్లప్రాణుల సుఖము దుఃఖము
ఆత్మతో సరిపోల్చి సమముగ
చూచుయోగే శ్రేష్ఠుడగునని
పార్థ ! తలచెదరూ! -32

*** అర్జునుడు ఇలా అడిగాడు:-**

మన స్థిరతకు అచ్చుయోగము
నీవు చెబితివి, దాని స్థిరతను
స్థితిని, చవలత కారణమ్ముగ
పొందకుంటిని శ్రీహరీ! —33

కృష్ణ! చంచలమైన మనసిది
బలము దృఢమును క్షోభపెట్టును
ఇట్టి దీనిని నిగ్రహించుట
గాలివలెనే కష్టసాధ్యము. -34

## * శ్రీ భగవానుడిలా అన్నాడు:-

మహాబాహో! మనసునాపుట
కష్టమయ్యా! చంచలమ్మది
అసంశయమిది; అయిన అభ్యా
సమున వైరాగ్యమున నిలబడు. -35

అసంయతాత్మని చేత యోగము
పొందకష్టము నామతంబిది
నిగ్రహాత్ముని యత్నయుక్తుల
వలన పొందగ శక్యము. -36

## * అప్పుడు అర్జునుడు ఇలా అడిగాడు:-

శ్రద్ధకలిగియు నిగ్రహంబును
లేకయోగము నుండి జారిన
యోగసిద్ధిని పొందజాలక
పొందునేగతి చెప్పుకృష్ణా! -37

యోగపథమున అస్థిరుండగు
మూఢుడిప్పుడు ఉభయ భ్రష్టుడు
అగుచు బెదరిన మొగులు వలెనే
నాశనంబునుపొందడా! -38

కృష్ణకృష్ణా! సంశయమ్మిది
నివారింపగ నీవె తగుదువు
నీవుతప్ప మరెవ్వరిచ్చట
సంశయమ్ముల్ భేదింపజాలరు! -39

* శ్రీ భగవానుడిలా చెప్పాడు:-

యోగభ్రష్టున కీ జగత్తున
పరమునందున లేదు నాశము
మంచిచేసిన ఎవడు దుర్గతి
పొందజాలడు కదానాయన! —40

యోగభ్రష్టుకు పుణ్యలోకాల్
పొంది యేండ్లట నుండి పిదపను
సదాచారుల ధనికులింటన్
పుట్టుతున్నాడోయ్. 41

లేక ధీమతులైన యోగుల
కులములందే జన్మమెత్తును
ఇట్టి జన్మంబేది కలదో
కష్టతరమీ లోకమందున. -42

కురుకుమారా! ఆ కులంబున
పూర్వదేహపు బుద్ధిపొందును
దానినాతడు యోగసిద్ధికి
మరల యత్నము సలుపుచుండును. - 43

ఊరకున్నా పూర్వజన్మపు
వాసనేమో ఈడ్చుచుండును
యోగమెరుగ తలంచినంతనె
వేదాతి వర్తితుడవ్వును. -44

ప్రయత్నంతో పనిని చేసిన
యోగి పాపము లేనివాడై
ఎన్నియో జన్మాల సిద్ధిని
పొంది ఉత్తమ గతిని పొందును. ..45

తపసికన్నా జ్ఞానికన్నా
కర్మిష్ఠికన్న యోగిశ్రేష్ఠి
శ్వేతవాహన! అందువలనన్
నీవుయోగివి కమ్ము ఇప్పుడు. 46

యోగులందరిలోన ఎవ్వడు
మనసు నాపై నిలిపి శ్రద్ధగ
ననుభజించిన శ్రేష్ఠతముడని
మమ మతమ్మయ్యా! —47

* ఉపనిషత్ప్రతి పాదగీతము
బ్రహ్మవిద్యయు యోగశాస్త్రము
కృష్ణనరసంవాద తత్త్వము
ఆత్మ సంయమ యోగము.

*



ఓం శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీభగవద్గీత

## ఏడవ అధ్యాయం

## విజ్ఞాన యోగం

*** శ్రీ భగవానుడు ఇలా అన్నాడు:-**

మనసు నాపై ఉంచి నన్నే
ఆశ్రయించు మొనర్చు యోగము
నన్ను పూర్తిగ అసంశయముగ
తెలియు మార్గము చెబుదు పార్థా! - 1

దేనితెలియగ నీ జగత్తున
తెలిసికొనునది మిగిలి యుండదొ
అట్టి యనుభవ జ్ఞానమంతా
నీకు చెప్పుదు నర్జునా! - 2

వేలమనుజులలోన ఒక్కడె
సిద్ధికొరకై చేయు యతనము
యతన మట్టుల చేయువారిలొ
ఒకడె నిజముగ నన్ను తెలియును. - 3

భూమి ఉదకము అగ్ని వాయువు
మనసు గగనము బుద్ధి అహమని
నాదగు ప్రకృతి అష్ట విధముల
విభజనమ్మయి ఉన్నది. - 4

ప్రకృతి పార్థా! కడునికృష్టము
దీనవేరై జగతిధారణ
చేయు నదియును, జీవరూపం
బైన ప్రకృతియే యుత్కృష్టము. -5

వీటివలననె ప్రాణులన్నియు
కలుగు నవియని తెలిసికొనుమా!
ఈ జగత్తు ప్రజన్మమునకున్
నాశనమునకు నేనెహేతువు. 6

ధనంజయుడా! నాకు వేరుగ
మరియునొక్కటి లేనెలేదోయ్!
దారమందలి మణుల వలెనే
అంత నాలో కూర్చబడినది. -7

పార్థ! ఉదకము నందు రుచినే
చంద్ర సూర్యులలో ప్రకాశము
వేదముల ప్రణవమును, శబ్దము
గగనమున, నరుల పౌరుషమును. -8

భూమియందున సుగంధంబును
అగ్నియందున ప్రకాశంబును
ప్రాణులందున ప్రాణమైతిని
తాపసులలో తపసు నేనోయ్. -9

సర్వభూతములన్ సనాతన
బీజమేనని తెలిసికొనుమోయ్
బుద్ధిమంతుల యొక్క బుద్ధిని
ధీరజనులకు ధైర్యంబును. -10

బలవంతులకు భారతా! ఆ
కానురాగములేని బలమును
భూతములలో ధర్మపద్ధతి
ననుసరించెడు కామమేనోయ్, -11

సత్త్వరజములు తమము గుణముల
వలన భావాల్ పుట్టి నాచే
కాని వాటిలో నేను లేనోయ్
అవ్వినాయందున్నవి. —12

మూడుగుణముల భావములచే
విశ్వమంతయు పొందిమోహము
ఈ గుణంబుల కన్న వేరగు
నన్నెరుంగ దనశ్వరునిగ. -13

ఏలయననీ దైవత్రి గుణం
బగునామాయ దాటకష్టము
నన్ను శరణని నమ్మువారలు
ఇట్టిమాయ తరింతురోయ్. -14

మూఢ దుష్కృత మాయమోహాలు
జ్ఞానహీనులు, అసురగుణముల
నాశ్రయించెడి మూర్ఖ మనుజులు
నన్నుపొందగ లేరు పార్థా! -15

జిజ్ఞాసువార్తు డర్థార్థుడు
జ్ఞానియను ఈ నాల్గు రకముల
సుకృతజనులే నాకు పూజను
చేయుచుందురు భరతవీరా! -16

వారిలోమరి నిత్యయుక్తుడు
ఏకభక్తుండైన జ్ఞానియె
శ్రేష్ఠుడతనికి నేను ఇష్టుడ
అతడునాకును మిగుల ఇష్టుడు. -17

వీరలందరు మంచివారే
జ్ఞానినేనని నామతమ్మోయ్
అతడు యుక్తాత్ముడై నన్నే
ఉత్తమ గతిగ నెంచెను. -18

జన్మలెన్నో గడవ నరుడగు
జ్ఞాని అప్పుడు వాసుదేవుడె
సర్వమనుకొని నన్నుపొందును
ఆ మహాత్ముడు అరుదుకనగా. -19

తమదు ప్రకృతీ ప్రేరణమ్మున
విషయచింతన వలన జ్ఞానము
వీడి, ఆయా నియమ బద్ధత
అన్యదేవతలను భజించిరి. -20

ఏయేభక్తుండర్చనమునకు
ఏయేరూపము నిచ్ఛగించునొ
దానిదానికి తగిన శ్రద్ధను
వానివానికి చేయుచుంటిని. -21

అట్టి శ్రద్ధను కలిగి యాతడు
అర్చనమ్మొనరించు వారికె
నావిధించిన ఇష్టఫలముల
నందుచుండును వారిచేతనె. -22

అల్పబుద్ధుల అట్టి ఫలితము
నాశవంతమ్మగును అర్జున!
దేవపూజకు దేవతలనే
నాదుపూజకు నన్నె పొందును. -23

నాశరహితంబుత్తమంబగు
పరమమయ్యిన నాస్వరూపము
తెలియజాలని జ్ఞానహీనులు
నన్ను వ్యక్తిగ తలచుచుండిరి. -24

యోగమాయచె కప్పియుండుట
వలన నందర కేను కనబడ
మూఢలోకము నాకు పుట్టుక
నాశముండదటంచెరుగరు. -25

భూతకాలము భావికాలము
వర్తమానము ప్రాణులందర
నేనెరింగెద, నన్ను మాత్రము
ఎవండెరుగడు అర్జునా! -26

సర్వప్రాణులు పుట్టగానే
ఇచ్ఛద్వేషసముద్భవమగు
ద్వంద్వమోహము, వలన అజ్ఞత
లోనపడుదురు పార్థుడా! -27

పుణ్యకర్మలు చేయుమనుజుల
పాపనాశన మైన ఎడలన్
ద్వంద్వమోహము నుండి విడివడి
దృఢవ్రతులై భజింతురు -28

జరామరణము నుండి ముక్తులు
కాగనన్నే ఆశ్రయింతురో,
ప్రత్యగాత్మయు సకలకర్మము
బ్రహ్మమేయని తెలిసికొందురు . ౨౯

సాధిభూతము సాధిదైవము
సాధియజ్ఞము నేనె; ఇట్టుల
ఎరుగువారే అంత్యమున జిత
చేతసులునై ననుగ్రహింతురు .౩౦

* ఉపనిషత్ప్రతిపాదగీతము
బ్రహ్మ విద్యయు యోగ శాస్త్రము
కృష్ణ నరసంవాద తత్త్వము
విజ్ఞాన యోగంబు

*



ఓం శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీభగవద్గీత

## ఎనిమిదవ అధ్యాయం

## అక్షర పరబ్రహ్మ యోగం

*** అర్జునుడు ఇలా అడిగాడు:-**

బ్రహ్మమేదధ్యాత్మమెయ్యది
కర్మమెయ్యది పరమపురుషా!
అధిభూతమేదని చెప్పబడెను
అధిదైవమని దేనినందురు! -1

దేహమందధి యజ్ఞుడెవ్వడు
అతనినెట్టుల తెలిసి కొందురు
ప్రయాణవేళ నిగ్రహాత్ములు
నిన్నదెట్టుల తెలిసికొందురు. -2

*** శ్రీ భగవానుడిలా చెప్పాడు:-**

అక్షరంబగు పరబ్రహ్మము
ప్రత్యగాత్మమె ఆధ్యాత్మమగు
ప్రాణిపుట్టగ చేయుత్యాగమె
కర్మ సంజ్ఞితము. -3

నాశద్రవ్యము అధిభూతమగు
పద్మభవుడగు నధిదైవతము
ఈ శరీరమునందునేన్
అధియజ్ఞుడన్ దృఢశరీరా! -4

అంత్యకాలము నందునెవ్వడు
నన్ను తలచుచు చచ్చిపోవునొ
నాదురూపము నతడుపొందును
అసంశయమిది అర్జునా! —5

చివర తానెటువంటి భావము
చింతచేయుచు మేను విడుచునొ
అట్టి భావస్మరణ వలనన్
అట్టి రూపమె పొందుపార్థా! —6

కనుక ఎప్పుడు నన్నె తలచుచు
రణం చేయుము; మనసుబుద్ధిని
నాకొసంగుము; అసంశయమిది
నన్నె పొందుదువు. —7

అభ్యాసమున యోగయుక్తుడు
అన్యగమనములేని చిత్తుడు
దివ్యుడగునా పరమ పురుషుని
స్మరిస్తాడు పొందుతాడోయ్. —8

కవిపురాణుడు శాసకుండును
అణువుకన్నా చిన్నవాడును
విశ్వమున కాధారభూతుడు
అర్కవర్ణుద చింత్యరూపుడు
అంధకారము పారద్రోలున్ —9

ఆతనిభక్తితొ అంత్యమందున
యోగబలమున బొమల మధ్యన
నిలిపి ప్రాణము నిశ్చయమ్ముగ
అచల మనమున చింత చేసిన
ఆతడు పొందునుగా. —10

వేద విదులెది అక్షరమనిరో
వీతరాగులు యత్నశీలురు
ఎందుచనిరో; దేనికోరుచు
బ్రహ్మచర్యమునందు నడచిరో
సంగ్రహంబుగ దాని జెప్పెదు. —11

ఎల్లద్వారాలన్ బిగించియు
మనసు హృదయమునందు నిల్పియు
మూర్ధమున ప్రాణమ్ము నుంచియు
యోగమను ధరించువాడై . -12

బ్రహ్మవాచకమైన ఓం మును
ఉచ్చరించుచు అనుస్మరించుచు
దేహమును వదలంగనాతడు
పరమగమ్యమునందు కొనునోయ్. —13

నిగ్రహాత్ముడు నగుచు సతతము
ననుస్మరించెడు నిత్యయుక్తుం
డైన యోగికి నేను సుళువుగ
పొందబడుదయ్యా! —14

పరమమోక్షము పొంది పెద్దలు
నన్ను పొందియు, దుఃఖనిలయము
నశ్వరంబగు మరో జన్మము
ఎపుడు పొందరుగా! —15

బ్రహ్మలోకమువరకు నుండిన
లోకములు పునరావర్తినము
లందువలనన్ నన్నుపొందిన
మరల జన్మయె లేదు పార్థా! —16.

బ్రహ్మపగటికి బ్రహ్మరాత్రికి
వేయివేయియుగాల పరిమితి
ఉన్నదని గ్రహియించు వారికె
పగలు రాత్రుల నిజము తెలియును. —17

బ్రహ్మపగలది మొదలుకాగా
అవ్యక్తమభి వ్యక్తమవ్వును
బ్రహ్మరాత్రది మొదలుకాగా
అభివ్యక్తమవ్యక్త మవ్వును. —18

అట్టిదగు ఈ భూతజాలము
కర్మవశమై జన్మలెత్తును
రాత్రిరాగనె విలయమొందును
పగలురాగనె మళ్ళిపుట్టును. 19

వ్యక్తమునకును భిన్నమైనది
సనాతనమ వ్యక్త పరమము
భూతజాలము నాశమైనా
అదివినాశన మొందదయ్యా! —20

అందురక్షర మది అవ్యక్తము
పరమగతియని చెబుదురయ్యా!
దేనిపొందిన జన్మముండదొ
నాదు పరమస్థాన మదియే! —2

ప్రాణులెవ్వని లోన ఉన్నవొ
జగత్తెవ్వని చేత వ్యాప్తమొ
పరమ పురుషుం డతడనన్యపు
భక్తికందునుగా! —22

ఎట్టికాలమునందు వెళ్ళిన
యోగి వర్యులు తిరిగి రారో
ఎపుడు వెళ్ళిన తిరిగి వత్తురో
చెబుదు వినుమయ్యా! -23

నిప్పువెలుగును పగలు శుక్లము
ఉత్తరాయణ మారుమాసాల్
అపుడు వెళ్ళిన బ్రహ్మవేత్తలు
బ్రహ్మమందెదరు. -24

పొగయు రాత్రియు కృష్ణపక్షము
దక్షిణాయన మారుమాసాల్
అపుడు వెళ్ళిన యోగి చాంద్రిని
పొంది వెనుకకు తిరిగి వచ్చును. -25

శుక్లకృష్ణములనెడు మార్గాల్
శాశ్వతములని ఎంచబడునోయ్
మొదటిదానికి జన్మముండదు
వెనుకదానికి మరల జన్మము. -26

రెండుమార్గము లివ్వి ఎరిగిన
యోగిఎవ్వడు మోహమందడు
కనుక అర్జున! ఎల్లవేళల
యోగయుక్తుడ వీవుకమ్మోయ్! -27

యోగిదీనిని తెలుసు కొంటడు
శ్రుతుల యజ్ఞము తపసు దానము
లందు పుణ్యము ఫలము పెద్దలు
ఏది చెప్పిరో అది తరిస్తడు
ఆది బ్రహ్మము నందుకొంటడు. -28

* ఉపనిషత్ప్రతి పాదగీతము
బ్రహ్మవిద్యయు యోగశాస్త్రము
కృష్ణనరసంవాద తత్త్వము
అక్షర పరబ్రహ్మయోగము.

*





ఓం శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీభగవద్గీత

తొమ్మిదవ అధ్యాయం

## రాజవిద్యా రాజగుహ్యయోగం

*** శ్రీకృష్ణుడు ఇలా చెప్పాడు:-**

అశుభము తొలగు దీనివినగా
నీవు అనసూయుడవు కనగా
జ్ఞాన విజ్ఞానమ్ము గుహ్యము
బ్రహ్మజ్ఞానము చెప్పుతున్నా! -1

రాజవిద్యయు రాజగుహ్యము
పూతముత్తమమైన ఇయ్యది
ధర్మయుక్తము వ్యయముకానిది
చేయ సులభము తెలియ దగినది. -2

ధర్మమంద శ్రద్ధలయ్యున
నన్నుపొందక మృత్యువను సం
సారమందే మనుజులెల్లరు
తిరుగుతున్నారోయ్. 3

నేనవ్యక్తుడ నా వలననే
ఈ ప్రపంచం వ్యాప్తి అయినది
ప్రాణులన్నీ కలవు నాలో
నేను వాటిలో లేనెలేనోయ్. -4

భూతములు నాలోన నిలువవు
కనుము యోగము మమైశ్వర్యము
భూతస్రష్టను భూతభృత్తును
అయిన ప్రాణులలోన లేనోయ్. -5

విశ్వమంతట సంచరిస్తూ
మహిమమగునా వాయువెప్పుడు
గగనమందున ఉన్నయట్టులె
కలవునాలో ప్రాణులోయ్. .6

పార్థ! ప్రాణులు ప్రళయమప్పుడు
నాదు ప్రకృతిని చేరి యణగును
సృష్టికాలంలోన వాటిని
మళ్ళి సృష్టిస్తా! .7

ప్రాణులన్నీ వశము ప్రకృతికి
అస్వతంత్రాలైన వీటిని
స్వీయ ప్రకృతిని వ్యవహరిస్తూ
మళ్ళి మళ్ళీ సృష్టిచేస్తా! .8

అట్టికర్మల తగిలి ఉండను
ఉదాసీనుగ ఉందునర్జున!
అట్టికర్మలు నన్ను నెప్పుడు
బంధింపజాలవుగా! -9

నాదు అధ్యక్షాన ప్రకృతియె
చరాచరము సృష్టించుచున్నది
ఇట్టిహేతువు వలన విశ్వము
నడుస్తున్నది కౌంతేయా! -10

నాపరంభావమును ఎరుగని
సర్వభూతేశ్వరుని, మూఢులు
మనుజదేహము నాశ్రయించిన
నన్నలక్ష్యము చేయుచుండిరి. -11

అట్టివారల ఆశవ్యర్థము
కర్మవ్యర్థము తెలివి వ్యర్థము
బుద్ధిహీనులు నగుచు రాక్షస
భావములనే ఆశ్రయింతురు. -12

నరః మహాత్ములు దైవ ప్రకృతిని
ఆశ్రయించిన నన్ను ప్రాణుల
కాది అవ్యయమని గ్రహించియు
భజనచేతురనన్య మనసున. -13

వారలెప్పుడు నను స్తుతిస్తరు
దృఢవ్రతులై ప్రయత్నిస్తరు
భక్తిగల్గిన మస్కరిస్తరు
నిత్యయుక్తతను పాసిస్తరు. -14

మరియు కొందరు జ్ఞానయజ్ఞము
స్వీకరిస్తరు ఉపాసిస్తరు
ఏకమనియును వేరువేరని
అనియనేకము ననుభజిస్తరు. -15

నేనెక్రతువును నేనెయజ్ఞము
నేనెమంత్రము నేనె ఆజ్యము
నేనె అగ్నిని నేనెహోమపు
కర్మమయ్యుంటిన్. -16

ఈ జగత్తుకు పితామహుండను
తల్లిదండ్రిని రక్షకుండను
పవిత్రంబును వేద్యమోమును
ఋక్సామ యజులన్ అర్జునా! —17

గతిని భర్తను ప్రభుడసాక్షిని
ప్రాణి కిరవును హితుడ శరణుడ
అవ్యయుండను నిధిని బీజము
సృష్టిస్థితిలయకర్తనోయ్. -18

తాపమవుతానేతపిస్తా
వర్షమవుతానేకురుస్తా
వర్షమాపుత, నేను అమృతము
మృత్యువును సత్తునసత్తునున్. -19

సోమపానులు త్రయీవిద్యులు
పూతపాపులు యజ్ఞములచే
స్వర్గకాంక్షులునై భజిస్తరు
పుణ్యఫలదేవేంద్రలోకము
పొంది భోగములనుభవిస్తరు. —20

వారలా సువిశాల స్వర్గము
పొందిపుణ్యం బంతరించగ
మర్త్యలోకము మళ్ళివస్తరు
త్రయీధర్మము ననుసరిస్తరు
కామమున అటునిటు చరిస్తరు. —21

అన్యభావాల్ లేకనన్నే
ఎవరుధ్యానము చింతచేస్తరో
అట్టివారల నిత్యనిష్ఠల
యోగక్షేమాల్ నేధరిస్తా! —22

పార్థః ఎవ్వరు భక్తి శ్రద్ధల
అన్యదేవతలన్ భజింతురో
వారునన్నే విధిని వదలిన
పూజచేసిన వారలగుదురు. -23

ఏలయనగా యజ్ఞములకున్
భోక్త ప్రభువును నేనె యగుమను
నన్ను నిజముగ వారలెరుగరు
అందువల్లనె మరో జన్మము. -24

దేవపూజకు దేవతలనే
పితృపూజకు పితృజనులనే
భూతపూజకు భూతములనే
నను భజిస్తే నన్నె చేర్దురు. -25

పత్రపుష్పాల్ ఫలంతోయాల్
ఎవడు భక్తిని నాకొసంగునొ
యత్నశీలుని భక్తి అర్పణ
ప్రియంగానే స్వీకరిస్తా. -26

పార్థః ఎయ్యది నీవుచేసిన,
ఏది తిన్నా, ఏది ఇచ్చిన
యజ్ఞమైనా తపస్సయినా
నాకె అర్పణ చేయుమయ్యా! -27

కర్మనే అర్పించు యోగము
కలిగి పుణ్యాల్ పాపఫలముల
కర్మబంధాల్ వీడిపోతవి
బంధముక్తుడః నన్ను పొందుదు. -28

సర్వభూతములందు సముడను
లేడు ద్వేష్యుడు లేడు ప్రియుడును
నాదుభక్తుల లోననుందును
వారునాలో ఉందురయ్యా! -29

అధిక ధూర్తుడనన్యభక్తిని
ననుభజించిన శ్రేష్ఠుడేయగు
ఏలయనగా సుస్థిరమ్మగు
మనోనిశ్చయ మతడు పొందెను. -30

అతడు ధర్మాత్ముడగు వెంటనె
మరియు శాశ్వత శాంతి పొందును
నాదుభక్తుడు చెడడు పార్థా!
ఈ ప్రతిజ్ఞను చేయవయ్యా! -31

పాపజన్ములు స్త్రీలువైశ్యులు
శూద్రులైనా ఆశ్రయిస్తరు
నిశ్చయంగా వారలుత్తమ
పదవి పొందెదరయ్య పార్థా! -32

భక్తజనులగు రాజఋషులును
పుణ్యబ్రాహ్మల చెప్పనేలా!
అసుఖమనిత్య లోకమునగల
నీవు ననుభజించుమయ్యా! -33

మన్మనుడవై భక్తుడవునై
ననుభజించు నమస్కరించుము,
మత్పరాయణ మనస్తత్వం
కలిగితలచుము, నన్నుపొందుదు. -34

* ఉపనిషత్ ప్రతిపాదగీతము
బ్రహ్మవిద్యయు యోగశాస్త్రము
కృష్ణనరసంవాద తత్త్వము
రాజవిద్యయు రాజగుహ్యము.

*



ఓం శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీభగవద్గీత

## పదవ అధ్యాయం

## విభూతి యోగం

* శ్రీ భగవానుడిలా చెప్పాడు:-

సంతసించే మహాబాహో!
చక్కగా వినవయ్యా! హితమును
నీకుచేయగ మంచి వాక్యము
నిజముగా చెబుతుంటి నయ్యా! 1

నాదుపుట్టుక దేవగణములు
సాధు ఋషులును ఎరుగరయ్యా!
దేవతలకును మహర్షులకును
సర్వమునకే నాదినయ్యా! —2

నన్ను జన్మగ అనాదిగమరి
లోకములకే ఈశ్వరునిగా
ఎవడెరుంగునొ అతడు జ్ఞానగు
సర్వపాపముల ముక్తుడగు. —3

బుద్ధిజ్ఞానము మోహరహితము
ఓర్పు సత్యము శమదమంబులు
సుఖము దుఃఖము పుట్టు నాశము
భయాభయములునున్. —4

సమత, తుష్టి, అహింస, తపమును
కీర్తియపకీర్తియును దానము
ఇన్నివిధముల గుణములన్నియు
ఈజీవులకు కలుగు నాచే -5

ఇట్టి ప్రజలును అట్టి ఋషులును
మనువులును సనకాది దివ్యులు
నాచుభావము మనఃకల్పము
వల్ల పుట్టిరిగా. —6

ఏవడుఃయోగము నావిభూతిని
ఎరిగి, నిజమును తెలుసుకొనునో
అతఃను నిశ్చల యోగయుక్తుడు
అర్జునాలేదు సంశయము. —7

జగతి పుట్టుట కేను హేతువు
అంత నాచే నడుస్తున్నది
అని వివేకులు పూర్ణభక్తిని
ననుభజిస్తున్నారు సుమ్మోయ్ః -8

మచ్చిత్తులు మద్గత ప్రాణులు
నాగురించే చెప్పుకొంటరు
ముచ్చటిస్తరు తృప్తి పడుతరు
ఆనంద మందెదరు. —9

సతతయుక్తులు ప్రీతితోభజి
యించువారలు, దేన నన్నే
పొందగలరో, జ్ఞానయోగము
అదే ఇస్తున్నా: -10

అట్టి భక్తులపైనిదయచే
వారి మనసున నిలిచి జ్ఞానపు
దీపకాంతిని, మోహతమము న
శింపజేస్తున్నా. -11

* అర్జునుడు అడిగాడు -

పరబ్రహ్మా! పరంధామా!
పరమపావన! నిన్నునిత్యుగ
దివ్యునిగ అజునిగను పురుషుగ
విభునిగను మరి ఆదిదేవునిగన్. -12

ఋషులు అందరు నారదుండును
అసితుడును, దేవలుడు వ్యాసుడు
చెప్పుచుండిరి, నీవుస్వయముగ
అట్టులే అనుచుంటివి. -13

కృష్ణ! దేనిని చెప్పుతుంటివో
అదే సత్యమటంచు నెంచితి
దేవదేవా! నీ స్వరూపము
సురాసురులును ఎరుగజాలరు. -14

పురుషోత్తమా! భూతభావన!
దేవదేవా! జగన్నాథా!
భూతేశుడవు! నీస్వరూపము
నీవెస్వయముగ ఎరుగుదయ్యా! -15

ఏవిభూతుల విశ్వమంతా
వ్యాప్తమైతివో, అట్టి దివ్యవి
భూతులన్నీ పూర్తిగావివ
రించు శక్తుడ వీవుసత్యము. -16

యోగేశ్వరా! నిన్ను నిత్యం
ఎలాఎలా తెలిసి కొందును?
ఏయే వస్తువులందు నిన్ను
ధ్యానింతు భగవంతా! -17

నీవిభూతిని యోగమహిమను
కృష్ణ! తెలుపుము విస్తరంగా
ఎందుకంటే అమృత వాక్కులు
ఎన్ని విన్నా తృప్తి కలుగదు. -18

*** శ్రీ భగవానుడు ఇలా అన్నాడు:-**

కురుశ్రేష్ఠా! నాదు దివ్యవి
భూతులల్లో ముఖ్యమైనవె
నీకు చెబుతా! ఎందుకంటే
విస్తృతమిది అనంతమోయీ! –19

అర్జునా! నేనెల్ల ప్రాణుల
హృదయమందలి ప్రత్యగాత్మను
మరియు ప్రాణుల ఆదిమధ్యము
అంతమును నేనోయీ! -20

విష్ణువేనాదిత్యులందున
వెలుగుల్లో కిరణముల రవిని
మరుత్తులలో నేమరీచిని
చుక్కల్లో నేను చంద్రుడ. 21

నేనువేదములందు సామము
దేవతలలో వాసవుండను
ఇంద్రియాలను నేమనస్సును
ప్రాణులల్లో నేను చేతన. -22

నేనురుద్రుల శంకరుండను
యక్షరాక్షసులందు ధనదుడ
వసువుల్లో నేనె అగ్నిని
పర్వతాలను మేరువేనోయ్. —23

పురోహితులలో బృహస్పతుడను
సైన్యనాయకులందు స్కందుడ
సరస్సులలో సముద్రుండను
పార్థా! గ్రహియించవా! —24

నే మహర్షులయందు భృగుపును
వాక్కులను ఏకాక్షరంబును
యజ్ఞముల జపయజ్ఞ మేనోయ్
స్థావరాలను హిమాలయమును. —25

సర్వవృక్షములందు రావిని
దేవఋషులలో నారదుండను
గంధర్వులను చిత్రరథుడను
కపిలమునినే సిద్ధులల్లో. —26

సుధతో జనించిన ఉచ్చైశ్ర
వమును అశ్వములలో నేనోయ్
ఏనుగులనైరావతమ్మను
నరులలోననరాధిపుడను. —27

ఆయుధముల వజ్రాయుధమ్మను
ఆవుల్లో కామధేనును
ప్రజోత్పత్తుడనైన స్మరుడను
వాసుకిని సర్పాలలో. —28

నాగులల్లో అనంతుండను
వరుణుడను జలదేవతల్లో
పితృదేవతల ఆర్యమమనే
నియామకులందుయముడను. -29

దైత్యాదుల ప్రహ్లాదుండను
గణకులల్లో నేను కాలము
మృగములల్లో మృగేంద్రుండను
పక్షులల్లో గరుత్మంతుడ! -30

వేగవంతులలోన గాలిని
శస్త్రధారులలోన రాముడ
మత్స్యములలో నేను మకరము
మహానదులలో నేను గంగను. -31

పార్థ! సృష్టికి ఆది అంతము
మధ్యమేనని ఎరుగుమయ్యా!
విద్యలను అధ్యాత్మ విద్యను
వాదమును వాదించు వ్యక్తుల. -32

అక్షరమ్ములలో 'అ'కారము
సమాసమ్ముల నేను ద్వంద్వము
నేనె నాశములేని కాలము
విశ్వతోముఖుడైన ధాతను. -33

సర్వహరుడగు మృత్యువునునే
భావికాలము పుట్టుకనునే
స్త్రీల ఓర్పును ధృతిని మేధను
కీర్తి సంపద వాక్కు స్మృతినోయ్. -34

సామములలో బృహత్సామము
ఛందములలో నే గాయత్రిని
మాసములలో మార్గశిరమును
ఋతువులల్లో వసంతమ్మును. —35

వంచకమ్ములలోన జూదము
తేజస్వులలో తేజమేను
జయము యత్నము సాత్త్వికులలో
సత్త్వగుణము నేనోయీ! —36

వృష్ణికులమున వాసుదేవుడ
పాండవులలో అర్జునుండను
మునులలోమరి వేదవ్యాసుడ
కవులలో శుక్రుడనునే. —37

దమయతాత్ముల దండనంబును
జిగీషాత్ముల నీతినగుదును
రహస్యాలను మౌనమగుదును
జ్ఞానవంతుల జ్ఞానమగుదును. —38

ప్రాణికోట్లకు మూలకారణ
మేదొ అదియే నేను పార్థా!
చరాచరమగు వస్తువేదియు
నన్నువినా వేరు లేదోయ్. —39

ఓపరంతప! నాదు దివ్యవి
భూతులకు అంతంబు లేదోయ్!
అయిన కొన్నిట సంగ్రహంగా
వివరించినాడనుగా! —40

కాంతి గలది విభూతి గలయది
ఊర్జితంబుదియైన వస్తువు
లెవ్వియగలవో అవ్వి నా—తే
జోఽంశ సంభవాలోయీ! -41

విపులమగునీ జాతజ్ఞానము
వల్ల నీకగు లాభమేమిటి!
ఈ జగత్తాక అంశముననే
వ్యాపించి ఉన్నానర్జునా! -42

* ఉపనిషత్ప్రతి పాదగీతము
బ్రహ్మవిద్యయు యోగశాస్త్రము
కృష్ణనరసంవాద తత్త్వము
విభూతియోగంబు!

*



ఓం శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీభగవద్గీత

## పదకొండవ అధ్యాయం

## విశ్వరూప సందర్శన యోగం

* **అర్జునుడు ఇలా అడిగాడు:-**

అనుగ్రహమును చూపినాపై
వరమమైనది గుహ్యమైనది
అధ్యాత్మమది ఏది చెబితివో
అణగె నజ్ఞానమ్ము దానస్. -1

ఏలయన నో కమలనేత్రా!
ప్రాణి పుట్టుక మరియు నాశము
అవ్యయంబగు నీదుమహిమయు
నీవల్లనే నే వింటిగా! -2

నిన్నుగూర్చియు నీవుచెప్పిన
దంతసరియే ననుచునమ్మితి
ఈశ్వరంబగు విశ్వరూపము
చూడదలచితి నుత్తమా! -3

ఓ ప్రభూ! నీ విశ్వరూపము
చూడసాధ్యం బంచునెంచిన
అవ్యయంబగు నీదురూపము
నాకుచూపు యోగేశ్వరా!

*** శ్రీ భగవానుడు ఇలా చెప్పాడు:-**

అలౌకికములనేక విధములు
వివిధ వర్ణాకారములతో
వందలాదిగ వేలకొలదిగ
నాదు రూపాల్ చూడు ఉన్నవి. -5

చూడుభారత! రుద్రవసువుల
అశ్వినీ దేవతల సూర్యుల
ఎపుడు చూడని అద్భుతాలను
ఇపుడు చూడయ్యా! -6

చరాచరమగు నీజగత్తున
దేనిచూడగ నీవు దలచితొ
ఈ శరీరమునందు ఒకచో
నున్నదానిగ నిపుడు చూడుము. -7

నీదుకనులన్ నన్ను చూడగ
లేవుకావున దివ్యదృష్టిని
ఇచ్చుచుంటిని ఈశ్వరంబగు
మమయోగ మహిమన్ చూడుమా! -8

*** సంజయుడు ఇలా అన్నాడు:-**

మహాయోగేశ్వరుడు కృష్ణుడు
చెప్పిఇట్టుల మహారాజా!
ఈశ్వరంబగునశ్వరంబగు
విశ్వరూపము చూపె నరునకు. -9

**చాలముఖములు చాలకనులును**
**చాలవింతలు చూపు నదియును**
**దివ్యములునగు సౌమ్యగలదియు**
**దివ్యాయుధము లున్నదియునున్.** -10

దివ్యమాల్యాంబరములున్నది
దివ్యగంధం పూతలున్నది
వింతలున్నదనంతమైనది
ముఖములెల్లెడ కలది కాంతిది. —11

గగనమునవేలాది సూర్యుల
కాంతియేకలగలసిరాగా
ఉన్నకాంతియె ఆ మహాత్ముని
కాంతికిన్ సరి పోలియున్నది. —12

వేరువేరుగ వివిధములుగా
ఉన్నజగతిని దేవదేవుని
దేహమందొక చోట నుండిన
యట్లు పార్థుడు చూచెనయ్యా! —13

విస్మయుండై పులకరించెను
విశ్వరూపునికిడెను దండం
నెత్తిపైజోడించి చేతులు
పలికె పార్థుండిట్టులన్. —14

*** అర్జునుడు ఇలా అడిగాడు:-**

దేవతలనీ దేహమందున
జీవకోట్లను సమస్తమ్మును
ఈశుడును కమలాసనస్థుని.
సర్వ ఋషులను దివ్యనాగుల
దేవ! చూస్తున్నా! —15

ఎన్నియోబాహువులు ముఖములు
కన్నులుదరాలున్న వానిగ
చూచుచుంటిననంత రూపుగ
ఆదిమధ్యాంతములు నీయవి
కాంచకుంటిని విశ్వరూపా! —16

నిన్ను ఎల్లెడ నేకికిరీటిగ
గదాధారిగ చక్రహస్తుగ
కాంతిరాశిగ దీప్తిమంతుగ
అప్రమేయుగ దుర్నిరీక్ష్యుగ
కంటి దీప్తా నలర్కునిగన్. -17

నీవువేదిత పరమాక్షరము
నీవుజగతికి పరమమూలము
శాశ్వతములగు ధర్మత్రాతవు
అతిసనాతన పురుషవరుడవు
అవ్యయుడవనినామతమ్మొ. -18

ఆది మధ్యాంతరహితునిగ ఆ
నంతబాహువు శక్తి పరునిగ,
సూర్యచంద్రులు నేత్రములుగా
ప్రహుతావక్త్రునిగ, స్వీయ
కాంతిని తప్త విశ్వగ కంటి. 19

మంటిమంటికి మధ్యదేశము
దిక్కులన్నియు ఒక్కనీతో
వ్యాప్తమయ్యెను; భయంకరమును
అద్భుతంబగు నీదురూపము
చూచివిశ్వం బెదరుతున్నది. 20

ఈసురావళి చేరెనీలో
భీతితోస్తుతియించి కొందరు
ప్రాంజలించిరి, మునులు సిద్ధులు
స్వస్తి యనుచును పుష్కలమ్ముగ
నిన్ను స్తోత్రము చేయుచుండిరి. -21

విశ్వులశ్వినులును మరుత్తులు
సాధ్యులును వసువులును రుద్రులు
సూర్యులును గంధర్వయక్షులు
సిద్ధులసురుల సర్వసంఘాల్
విస్మయమ్మున నిన్నుచూచెను. -22

బహుముఖమ్ములు నయనములునున్
బహుకరమ్ములు తొడలు పాదాల్
బహూదరములు కఠిన దంష్ట్రలు
కలిగియుండిన జనులు నినుగని
భీతిచెందిరి; నేనునటులే. -23

నభస్స్పృశుడవు బహువర్ణుడవు
దీప్తమాయత నేత్ర ఘనుడవు
వివృతముఖుడవు దీప్తిమతుడవు
నిన్నుచూచిన మనసు చెదరెను
ధృతియు శాంతియు నన్ను వదలెను. 24

ప్రళయకాలాన లజ్వలితము
భయంకరమగు కోరలునుగల
ముఖములన్గని దిక్కుతోచక
నిలిచి ఉంటిని లేదు సౌఖ్యము
దేవః నాపైదయను జూపుము. -25

ధార్తరాష్ట్రులు ద్రోణభీష్ములు
కర్ణుడును భూపాల సంఘాల్
మనదు సైన్యములోని ప్రముఖులు
సైనయోధులు కలిసి వీరలు
క్రమముగామరి యందరున్. -26

నిన్ను వేగమె చేరువారై
భయంకరమగు కోరలునుగల
నీదు నోటిని చేరుతుండిరి
పండ్లసందుల చిక్కికొందరి
తలలు పొడిపొడి కాగ గన్బడె .27

నదీజలములు అన్ని సంద్రము
వైపు ఎవ్విధి ఏగుచుండునొ
అట్లె ఈనరలోక వీరులు
లెస్సమండెడు నీదు నోళ్లను
చేరుతున్నారయ్య పార్థా! -28

మిడతలెట్టుల నాశమునకై
బాగమండెడు అగ్నిలోబడ
అధికవేగముగా గమించునొ
అట్లె ఈ ప్రజ మహావేగము
గాను నీదగు నోళ్లజేరిరి -29

మండునోళ్లను జనులనందర
మ్రింగి ఆస్వాదించుచుంటివి
నీభయంకర కాంతి తనదగు
తేజములచే జగద్వ్యాప్తము
గా తపించెను విష్ణుమూర్తీ! -30

ఉగ్రరూపా! నీవు ఎవడవు?
చెప్పవయ్యా! ఎందుకంటే
నీ ప్రవృత్తిని ఎరుగకుంటిని!
ఆదివౌనిను ఎరుగ దలచితి
దండమయ్యా! దయనుజూపుము. -31

**• శ్రీ భగవంతుడు ఇలా చెప్పాడు:-**

శోకనాశనమునకు రేగిన
కాలుడననే; భూతజాలము
సంహరించగనిల చరించితి;
నీవుయుద్ధము చేయకున్నా
ఎదుటిసేనల వీరులుండరు. -32

కనుకలెమ్మిక! శత్రుజయమున
కీర్తిపొందుము, పూర్ణమగుభువి
అనుభవింపుము; వీరు నాచే
పూర్వమే మరణించి నారలు;
నీవునిమిత్త మాత్రుడవు! -33

నేను చంపితి ద్రోణ భీష్మల
కర్ణ సైంధవ జనులనెప్పుడొ!
ఇతర యోధుల నటులెచంపితి;
నీవుచంపుము; భయంపడకుము
ఆజిచేయుము; అరులగెల్తువు. -34

**• సంజయుడు ఇలా అన్నాడు:-**

విష్ణువాక్యాల్ విన్న పార్థుడు
వణకిపోయెను మోడ్చిచేతులు
వందనంబిడె; భయంపడియెను
నమ్రుడయ్యెను; గద్గదుండై
పలికినాడిటులన్. -35

**• అర్జునుడు ఇలా అన్నాడు:-**

నినుభజించగ జగతి ముదమగు
ప్రీతిపొందును హృషీకేశా!
బెదరి అసురులు దిశలకురికిరి
ప్రాంజలించెను సిద్ధసంఘాల్
అన్నినీకే తగినవయ్యా! -36

సత్ అసత్తులకును పరంబగు
అక్షరుండవు ఆదిదేవా!
ఓ మహాత్మా గరీయసుడవు
బ్రహ్మకాదివి నీవెనయ్యా!
నీకు దండాలేల పెట్టరు! -37

ఆదిదేవ! పురాణపురుషా
ఈ జగత్తుకు వర నిధానమ!
నీవువేత్తవు వేద్యమగుమవు
వరంధామా! విశ్వమంతట
నీవెవ్యాప్తముగా. -38

నీవు యముడవు, అగ్ని, బ్రహ్మవు
శశివి వరుణుడ వజుని తండ్రివి
గాలిదేవుడ లీలె తండ్రీ!
వేలకొలదిగ వందనంబులు
నీకు మాటికి వందనంబులు. -39

విశ్వరూపా! ముందు వెనుకల
వందనంబులు; అన్నివైపుల
కలుగు అందరి వందనంబులు
అమితశక్తివనంత విక్రమ!
సర్వవ్యాప్తా! సర్వమీవే! -40

నాశరహితా! నీదు మహిమను
నేనెరుంగక ప్రమాదంబున
చనువు చేతను 'ఓయికృష్ణా!
ఓయియాదవ! ఓయి సఖుడా!
అంటు మోటుగ పలికితయ్యా! -41

తినెడునప్పుడు, తిరుగునప్పుడు
కూర్చొనినను, పరుండి నప్పుడు
ఒక్కడున్నపుడితరుల ఎదుట
పరిహాసాన పరిభవించితి
అవ్విమరి క్షమియించు కృష్ణా! -42

చరాచర జగతికిని తండ్రివి
పూజ్యతముడవు, శ్రేష్ఠ గురువువు
నీకు తుల్యుడు లేడు త్రిజగతి
ఇంక అధికుడు ఎక్కడుంటడు
అపరిమిత ప్రభావా! -43

అందుకే సాష్టాంగ పడితిని
ఈశ! స్తుత్యుడ! దండమయ్యా!
దయనుజూపగ వేడుచుంటిని
సుతుని తండ్రిగ సఖుని సఖునిగ
ప్రియను ప్రియునిగ సహించుదేవ! -44

ఎపుడు గాంచని దాని గాంచితి
సంతసించితి, భయమునన్ మది
వ్యథితమయ్యెను; పూర్వరూపము
దేవదేవా! నాకు జూపుము
దేవ! ప్రసీద జగన్నివాస! -45

నినుకిరీటిగ గదాధారిగ
చక్రహస్తుగ పూర్వరూపము
చూడగోరితి మహాభుజుడా!
నాల్గు భుజముల అట్టిరూపము
దాల్చు భగవంతా! -46

*** శ్రీ భగవానుడు ఇలా అన్నాడు:-**

నాప్రసన్నత వలన నీకై
కాంతిమయమును జగద్రూపము
ఆద్యమైనదనంతమైనది
ఇతరులెరుగని పరమ రూపము
యోగశక్తిని చూపబడినది. -47

పార్థ! దీనిని నీవు చూచితి
ఇహమునన్ కనలేదు ఎవ్వరు
వేదయజ్ఞాధ్యయన ములచే
క్రియల తపసుల దానములచే
నన్నుచూచుట వలను పడదోయ్. -48

ఈభయంకర విశ్వరూపము
చూచి చిత్తము చెదరభయమును
పొందబోకుము, భయమువీడుము
తృప్త చిత్తత పూర్వరూపము
మళ్ళి బాగా చూడవయ్యా! -49

*** సంజయుడు అన్నాడు:-**

ఈ ప్రకారము హరి కిరీటికి
చెప్పి తన రూపంబు చూపెను
ఆ మహాత్ముడు సౌమ్యరూపము
దాల్చిభయమున మునిగి యుండిన
పార్థునోదార్చెన్. -50

*** అర్జునుడు ఇలా అన్నాడు:-**

ఈ ప్రశాంత మనుష్య రూపము
చూచినామది కుదుటపడినది
సహజభావము పొందె నామది
శ్రీ జగన్నాథా! -51

* శ్రీభగవానుడప్పుడు ఇలా అన్నాడు:-

ఎట్టిరూపము నీవు చూచితో
అట్టిరూపము దుర్లభంబగు
అట్టిదానిని దేవవర్యులు
అన్నివేళల చూడదలతురు. -52

నన్ను ఎట్టుల నీవు చూచితో
అట్టిరూపము దానములచే
వేదములచే యజ్ఞములచే
తపముచేమరి కాంచ లేరోయ్. -53

పరంతపుడా! ఇట్టిరూపము
నేననన్యపు భక్తివల్లనె
తత్త్వమెరుగగ ప్రవేశించగ
చూడ శక్యుడనపుతనయ్యా! -54

నన్ను పరముగ నమ్మి కర్మము
సంగరహితుండై యొనర్చెడి
సర్వప్రాణుల ద్వేషరహితుడు
అగునా భక్తుడు నన్నె పొందును. -55

* ఉపనిషత్ప్రతి పాదగీతము
బ్రహ్మవిద్యయు యోగశాస్త్రము
కృష్ణనరసంవాద తత్త్వము
విశ్వరూప సందర్శనము.

ఓం శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీభగవద్గీత

## పండ్రెండవ అధ్యాయం

## భక్తియోగం

*** అర్జునుడు ఇలా అడిగాడు:-**

ఒకరు సతతము యుక్తభక్తులు
అక్షరాగోచరము ధ్యానులు
ఒకరు; ధ్యానము చేయువీరిలో
యోగవిత్తము లెవ్వరయ్యా! —1

*** శ్రీ భగవానుడు ఇలా చెప్పాడు:-**

మనసు నాపై నిలిపి సతతము
నిత్యయుక్తులు నగుచునన్నే
ఉపాసించెడు వారె యుత్తమ
యోగులని నామతమ్మోయ్. —2

అనిర్దేశ్యము అవ్యక్తంబును
అక్షరంబును అచింత్యంబును
అచలమవికారమును ధ్రువమును
సర్వవ్యాపియునున్. —3

అయిన నన్నే జితేంద్రియులై
సర్వసములై భూతహితులై
ఎవరు ధ్యానము చేయుచుందురొ
వారు నన్నే పొందుచుందురు. —4

నిర్గుణంబగు బ్రహ్మకాంక్షుల
క్లేశమధికమ్మయ్య పార్థా!
ఏలయన దేహాభిమానుల
కద్ది ఎంతో కష్టసాధ్యం. ౫

సర్వకర్మల నాకొసంగియు
నన్నెవరముగనెంచి యితరము
లేని చిత్తము తోడధ్యానము
నుపాసనమును చేయువారల్. —6

చిత్తమును నా యందు చేర్చిన
అట్టివారిని మృత్యుసంసా
రాబ్ధి నుండియు నేనుశీఘ్రమె
లేవనెత్తెదనూ. —7

చిత్తమును నాయందు స్థిరముగ
నిలుపవయ్యా! బుద్ధి నాలో
చొనుపుమయ్యా! అపుడునాలో
ఉండెదవు; లేదు సంశయమూ. —8

అలా చిత్తము నిలుప స్థిరముగ
నీకు శక్తే లేని యప్పుడు
అర్జునా! అభ్యాస యోగము
చేతపొందగ పూనుమయ్యా! —9

శక్తి అభ్యాసమున లేనిచొ
నాగురించిన కర్మచేయుము
అలా నాకై కర్మచేసిన
సిద్ధి పొందుదు వర్జునా! —01

నాదుయోగము నాశ్రయింపుము
దీనినైనా చేయలేవా!
యతాత్ముడవై సర్వకర్మల
ఫలత్యాగము చేయుమా! -11

అభ్యాసమున కన్న జ్ఞానము
శ్రేయము; దానికన్న ధ్యానము;
ధ్యానముకన్న ఫలత్యాగము
త్యాగమున శాంతి కలుగున్. -12

భూతములపై ద్వేషరహితుడు
స్నేహకరుణలు ఉన్నవాడును
నిర్మముడును నిరహంకారియు
సుఖదుఃఖసముడః సహనుడున్. -13

సతతతృప్తుడు యోగయుక్తుడు
యతాత్ముడును దృఢనిశ్చయుడును
మదర్పితుడగు మనోబుద్ధుడు
మద్భక్తుడగు నాతడిష్టుడు. -14

ఎవడు జగతిని భయంపెట్టడో
ఎవడు జగతికి భీతిపొందడో
హర్షామర్షభయో ద్వేగము
లేనివాడో- అతడె ఇష్టుడు. -15

శుచుడు దక్షుడు తటస్థుండును
అకాంక్షుండును అదుఃఖుండును
కర్తృత్వముల పరిత్యాగుడు
అనాభక్తుడు నాకు ప్రియుడు. -16

ఎవడు తృప్తుడు కాడో, శోకిం
చడో, ద్వేషించడో, శుభముల
అశుభమ్ములను వదలివేస్తడో
అట్టిభక్తుడు నాకు ప్రియుడు. -17

శత్రుమిత్రుల యందు సముడును
మానమవమానముల సముడును
శీతోష్ణసుఖ దుఃఖసముడును
సంగ వర్జితుడైన వాడున్. -18

మౌని, నిందాస్తుతుల సముడును
లభ్యమునకే సంతుష్టుడును
అని కేతుడు స్థిరమనస్కుడు
భక్తిమతుడగు నరుం డిష్టుడు. -19

ఎవరు శ్రద్ధావంతులైనను
పరమ మని ధర్మ్యామృతమ్మును
ఈవిధంగా ఉపాసిస్తరో
అట్టిభక్తులు నాకు ప్రియులు. -20

* ఉపనిషత్ప్రతి పాదగీతము
బ్రహ్మవిద్యయు యోగశాస్త్రము
కృష్ణ నరసంవాద తత్త్వము
భక్తియోగంబూ

ఓం శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీభగవద్గీత

పదమూడవ అధ్యాయం

## క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ యోగం

*** అర్జునుడు ఇలా అడిగాడు:-**

ప్రకృతి పురుషుల, క్షేత్రక్షేత్ర
జ్ఞులను, జ్ఞానము జ్ఞేయములనున్
తెలిసికొనగా కోరుతున్నా
చెప్పు శ్రీకృష్ణా! —1

*** శ్రీ భగవానుడు ఇలా చెప్పాడు:-**

ఈ శరీరము క్షేత్రమనబడు
క్షేత్రజ్ఞుడగు దీని తెలిసిన
అనుచు తెలిసిన వారలందురు
వినుము కౌంతేయా! —2

సర్వక్షేత్రములందు నుండిన
నన్ను క్షేత్రజ్ఞునిగ నెరుగుము
క్షేత్రక్షేత్రజ్ఞత్వ జ్ఞానము
ఏదో అదియే నిజజ్ఞానము. —3

క్షేత్రమేదో ఎట్టిదదియో
దేనపుట్టె; వికారమేమో
అతండెవడో; ప్రభావమేమో
సంగ్రహంగా చెబుత వినుమా! —4

వేరువేరుగ ఋషులు దీనిన్
వివిధ వేదములందు చెప్పిరి
హేతువాద సునిశ్చితమ్మగు
బ్రహ్మసూత్రపదాల చెప్పిరి. —5

మహాభూతము లహంకారము
బుద్ధిగర్వము మూల ప్రకృతియు
ఇంద్రియములును పదునొకండును
ఇంద్రియ విషయమ్ము లైదున్. —6

సుఖము దుఃఖము ధృతియు చేతన
ఇచ్ఛ ద్వేషము సముదాయమున
సవికార క్షేత్రము దాహృత
మయ్యెను సంగ్రహంగా. —7

ఓర్పు ఋజుతయు స్థిరతశౌచము
ఆత్మనిగ్రహ మార్య సేవయు
కలిగియుండుట; పొగడకునికియు
అదంబత్వమహింసయునున్. -8

ఇంద్రియార్థములన్ విరాగము
అహంకారము లేకనుండుట
జన్మమృత్యు జరావ్యాధులను
కలుగుదుఃఖము దొసగు తలచుట. -9

ఆలుబిడ్డలు, గృహము నందును
అనభిమానము నయిష్టంబును
శుభాశుభములు ప్రాప్తమయినను
సతము సమమగు చిత్తముండుట. -10

ఏకాగ్రబుద్ధిని అచలమగు
భక్తినాపై కలిగియుండుట
జనము మధ్యన ఉండకుండుట
ఏకాంతస్థలము కోరుటయున్. -11

జ్ఞానాధ్యాత్మ నిత్యుడగుటయు
జ్ఞానతత్త్వ దర్శనుడగుటయు
ఇవేజ్ఞానముగా ప్రవక్తము
దీనికన్యమజ్ఞానము. -12

ఏదిజ్ఞేయమొ, దేని తెలిసిన
అమరమందునొ చెబుదు దానిని
ఆదిలేనిది పరబ్రహ్మము
సత్ అసత్తని చెప్పబడదు. -13

ఆత్మయంతట పాణిపాదాల్
అక్షిశిరములు చెవులు ముఖములు
కలిగియున్నదినై ప్రపంచము
నంతటన్ వ్యాపించియున్నది. -14

అది సర్వేంద్రియ గుణాభాస
సర్వేంద్రియ వివర్జితమ్మును
అసక్తమ్మును సర్వభరమును
నిర్గుణమ్మును గుణానుభవమున్. -15

ప్రాణి, బహిరంతాల నుండును
చరాచరమును సూక్ష్మమౌనది
దూరముండును ఉండుదగ్గర
అర్థమవనిదియున్. -16

అవిభక్తమది, అగువిభక్తము
భూతజాలము సృష్టిచేస్తది
చేయుపోషణ, లయంచేస్తది
అని తెలియవలెనయ్యా! -17

వెలుగులకునది వెలుగునిచ్చును
తమసుకంటే అన్యమయ్యేది
జ్ఞానజ్ఞేయము జ్ఞానగమ్యము
సర్వహృది సుప్రతిష్ఠితము. -18

జ్ఞానమును జ్ఞేయమును క్షేత్రము
సంగ్రహంగా నేను చెప్పితి
నాదుభక్తుడు తెలిసి దీనిని
నాస్వరూపము పొందగాదగు. -19

ప్రకృతి పురుషులనాది వారలు
గా నెరుంగుము పార్థ! ఇరువుర
వికారమ్ములు గుణములన్నీ
ప్రకృతి జన్యములని గ్రహించుము. -20

కార్యకారణ కారకమ్ముకు
ప్రకృతె హేతువు చెబుదురయ్యా!
సుఖము దుఃఖము పొంద పురుషుడె
హేతువందురు అర్జునయ్యా! -21

ప్రకృతియందున ఉండి పురుషుడు
ప్రకృతి జన్యగుణాలు పొందును
ఆ గుణమ్ముల సంగమమ్మే
నీచముత్తమ జన్మహేతువు. -22

పురుషుడీదేహాన ఉన్నను
పరుడే; సాక్షియు, భర్త, ఈశుడు
భోక్త, అనుమతి నిచ్చువాడును
పరమాత్మయే నయ్యాః -23

పురుష గుణముల తోడకూడిన
ప్రవృతినెవ్వడ. ఇట్టులెరుగునో
ఆతడెట్టుల నున్న గానీ
మళ్ళి పుట్టడుగాః -24

కొందరాత్మను శుద్ధమనమున
ధ్యానయోగము చేతగాంచిరి
అట్లెకొందరు సాంఖ్యయోగము
కొందరేమో కర్మయోగము. -25

కొందరిట్టుల తెలియజాలరు
పరులచే విని ఉపాసింతురు
శ్రవణతత్పరులైన వారును
మృత్యువును దాటుదురు. -26

ఈ జగత్తున చరాచరమగు
ఏ పదార్థము పుట్టుచున్నదో
క్షేత్ర క్షేత్రజ్ఞులయు కలయిక
వలన నయ్యది కలుగుతున్నది -27

సర్వభూతములందు సముడగు
ఈశ్వరువినాశము జరిగినన్
నాశమొందని యట్లుచూచునో
ఆతడె నిజముగ చూచువాడగు. 28

ఏలయన తానెల్ల ప్రాణుల
యందుగల ఈశ్వరుని సమముగ
చూచి ఆత్మను హింసచేయడు
కనుక నుత్తమ గతిని పొందును. —29

ప్రకృతి వలననె సర్వకర్మలు
సర్వవిధముల జరిగినవియని
ఆత్మకర్తను మాటలేదని
ఎవరుకందురొ–సత్యసంధులు. —30

వేరుగాగల భూతజగతిని
ఒకే దానన్ ఉన్నదానిగ
దాననే వ్యాప్తించుదానిగ
చూచువాడే బ్రహ్మమందును. 31

నిర్గుణుండును అనాదియునగు
పరమ ఆత్ముడు దేహములలో
ఉన్నదేనిని అంటకుండును
చిన్ని అర్జునుడా! —32

సర్వవ్యాప్తమునైన గగనము
సూక్ష్మమైతా నంటబడదో
అటులె దేహాలందునుండిన
ఆత్మ దేనిని అంటకుండును. —33

ఒకేసూర్యుడు ఎల్లజగతిని
సుప్రకాశము చేయుచుండెనొ
అట్లె క్షేత్రజ్ఞుడును క్షేత్రాల్
సుప్రకాశము చేయు భారత! —34

జ్ఞానదృష్టిని క్షేత్ర క్షేత్ర
జ్ఞులయు భేదము, భూతప్రకృతికి
ముక్తియుక్తిని ఎవరుకందురో
వారు పరమము నందు కొందురు. -35

* ఉపనిషత్ప్రతి పాదగీతము
బ్రహ్మవిద్యయు యోగశాస్త్రము
కృష్ణనరసంవాద తత్త్వము
క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగము.

*





ఓం శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీభగవద్గీత

## పదునాల్గవ అధ్యాయం

## గుణత్రయ విభాగ యోగం

*** శ్రీ భగవానుడిలా అన్నాడు:-**

ఏది తెలుసుక మునులు బంధము
నుండి, ఉత్తమ సిద్ధి బడసిరో
అట్టి పరమము, పరమ జ్ఞానము
నైన జ్ఞానము మళ్ళి చెబుతా! —1

ఇట్టిజ్ఞానము నాశ్రయించియు
నాసాధర్మ్యము పొందివారు
సృష్టికాలము నందు పుట్టరు
ప్రళయ కాలమునందు గిట్టరు. —2

ఓయిభారత! మహత్ బ్రహ్మమె
నాదు ప్రాణులు పుట్టుస్థానము
దాన గర్భసు బీజముంచుదు
భూతజాలము పుట్టునయ్యా! —3

సర్వయోనుల పుట్టుదేహాల్
వాటికేమో మహత్ బ్రహ్మము
మాతృస్థానము, నేను బీజము
నుంచు తండ్రినిగా! —4

ప్రకృతి జన్యములైన స త్త్వము
రజ స్తమములు మూడుకూడా
అవ్యయాత్మను దేహమందున
భారతా! బంధిస్తు ఉన్నవి: -5

అందుస త్త్వము నిర్మల త్త్వము
ప్రకాశమ్మును ఆనామయమును
అందువల్లనె సుఖమ్ముజ్ఞానము
కోరి బంధిస్తున్నదయ్యా! .6

రజము రాగాత్మకము పార్థా!
తృష్ణ సంగసముద్భవమ్మది
కర్మసంగము చేతనాత్మను
లెస్స బంధిస్తున్నదయ్యా! -7

పార్థ! తమమజ్ఞాన జనితము
ఎల్లప్రాణుల కప్పుమోహము
మరపు అలసత మరియునిద్రన్
ఆత్మ నదిబంధి స్తదయ్యా! .8

స త్త్వమేమోసుఖము, కర్మను
రజము, తమమది కప్పుజ్ఞానము
ఇవి ప్రమాదమునందు జీవుని
చేర్చు, నాశ్చర్యమ్ము పార్థా! .9

స త్త్వమేమో రజ స్తమముల
రజస్సేమో స త్త్వతమముల
తమస్సేమో స త్త్వరజముల
అణచివే స్తవి అర్జునా! -10

దేహమునగల ద్వారములలో
కాంతిజ్ఞానము కలుగునప్పుడు
అపుడు సత్త్వము ప్రవృద్ధమ్మయి
నట్లు తెలియగ వలయునోయ్. —11



రజము పెరిగిన లోభమెదుగును
కర్మారంభము ప్రవృత్తియును

ఆశ పెరుగును శాంతిసున్నా

ఇవ్విపుడతవి భారతా! —12



తమము పెరిగిన బుద్ధిమాంద్యము
అలసతయుమరి అజాగ్రత్తయు
అజ్ఞానమను ఇవ్వియెన్నో
పుట్టుకొ స్తవి వీరభారత! —13

సత్త్వగుణమభివృద్ధి నుండగ
జీవుడప్పుడు చచ్చిపోతే
అతడునుత్తమ జ్ఞానులరిగెడు
అమలలోకము లందునోయీ! —14

రజము పెరిగిన వేళ చస్తే
కర్మసంగుల్లోన పుడతడు,
తమము పెరిగిన యపుడు చస్తే
మూఢయోనుల్లోన పుడతడు. —15

పుణ్యకర్మకు సాత్త్వికంబగు
స్వచ్ఛసుఖమే ఫలితమయ్యా!
రజఃకర్మకు ఏడ్పు; తమసుకు
ఫలము అజ్ఞానమ్ము అందురు. —16

సత్త్వగుణమున పుట్టుజ్ఞానము
రజోగుణమున కలుగులోభము
తమమునన్మరి మరపు భ్రమయును
పుట్టు అజ్ఞానమ్ము భారత! -17

సత్త్వులూర్ధ్వము వెళ్ళిపోతరు
రజులు మధ్యమ మందె ఉంటరు
నీచ గుణప్రవృత్తి తమసులు
అధమమున కరుగుతరు! - 18

దర్శనుండై గుణేతరమును
కర్తగా గ్రహియించకుంటడొ,
గుణేతరునిగ తననెరుంగునొ
అతడు మద్భావమ్ము పొందును. -19

దేహి, దేహము పుట్ట కారణ
మైన త్రిగుణాల్ దాటి, పుట్టుక
ముసలితనమును, చావు, దుఃఖము
చేత విడివడి అమృత మందును. -20

* **అర్జునుడు ఇలా అడిగాడు:-**

ఓ ప్రభూ! ఈ మూడు గుణములు
దాటు వాడే లక్షణుండగు?
ఎట్టి నడవడి కలిగి యుండును!
దాటువెట్లు ఈ త్రిగుణముల్. -21

* **శ్రీ భగవానుడు ఇలా చెప్పాడు:-**

ఎవడుపాండవ! లభ్యకాంతిని
ప్రవృత్తియుమరి మోహములనున్
తిరస్కరింపడొ, నివృత్తముల
మరికోరుకొనడొ -22

ఉదాసీనము వలన గుణముల
చేచలించడొ, గుణములేయిల
నడుస్తున్నవియని గ్రహించునొ,
ఎపుడు తా చలియించడో- -23

సుఖముదుఃఖము ప్రియాప్రియముల
శిలయు స్వర్ణము మృత్తు పిండము
లందు సముడును; స్తుతియునిందల
సముడు ధీరుడు స్వస్థుడున్— —24

మానమవమానముల తుల్యుడు
శత్రుమిత్రులయందు తుల్యుడు
పనుల నెల్లను పరిత్యక్తుడు
అందురతనిని గుణాతీతుడు. -25

నన్నచంచల భక్తియోగము
చేతనెవ్వడు సేవ చేయునొ
గుణాతీతుడు ఆతడవ్వను
బ్రహ్మమగుటకు అగుసమర్థుడు. -26

ఏలయన నేనవ్యయమ్మును
అమృతమ్మును శాశ్వతమ్మగు
ధర్మరూపము, నిరతిశయసుఖ
రూపబ్రహ్మకు ఆశ్రయాన్నోయ్ః -27

* ఉపనిషత్ప్రతి పాదగీతము
బ్రహ్మవిద్యయు యోగశాస్త్రము
కృష్ణనరసంవాద తత్త్వము
గుణత్రయ విభాగ యోగము.

*

ఓం శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీభగవద్గీత

## పదిహేనవ అధ్యాయం

## పురుషోత్తమ ప్రాప్తియోగం

* శ్రీ భగవానుడు ఇలా చెప్పాడు:-

ఊర్ధ్వమూలము అధశ్శాఖము
లయిన రావికి శ్రుతులు ఆకులు
అద్ది అవ్యయమని గ్రహించిన
వాడె వేదార్థి విడుదగును. 1

దానికొమ్మలు పెరిగి గుణముల
విషయ పల్లవములుగ క్రిందికి
పైకి వ్యాప్తము; మర్త్యజగతిని
కర్మబంధము కలుగ వేరులు
క్రిందుమీదను వ్యాప్తమైనవి. 2

దీనిరూపంబిలా తెలియదు
ఆదిమధ్యము అంతమందదు
వేళ్లు దృఢముగ నున్న రావిని
అసంగమ్మను గట్టిశస్త్రము
పట్టినరకాలోయ్. 3

పిదవ ఎచటికి పోతె రారో,
ఈయనాదియునైన ప్రవృత్తి
ఎవనిచేమరి వ్యాప్తిపొందెనో,
అట్టి ఆద్యపురుషుని శరణని
పరమ పదమును వెదకగావలె. 4

మానమోహాల్ లేని వారును
జితసంగదోషులు, అధ్యాత్మ
నిత్యులు, కాంక్షలేని వారలు,
సుఖము దుఃఖము ద్వంద్వముక్తులు
అయిన జ్ఞానులు పరము పోదురు. -5

అట్టిస్థానము సూర్యచంద్రులు
పావకుండును వెలుగునింపరు
దేనిపొందిన తిరిగిరారో
అదినాపరమ స్థానమ్ము. -6

నాసనాతన అంశమదియే
జీవలోకమునందు జీవుడు
అయ్యి ప్రకృతిని మనఃషష్ఠము
ఇంద్రియాలను గుంజుతున్నది. -7

మేనుజీవుడు విడుచునపుడును
నూత్నదేహము పొందునపుడును
గాలి, గంధమువలెనె వీటిని
స్వీకరిస్తడు వెళ్ళిపోతడు. -8

ఇట్టిజీవుడు చెవిని కంటిని
నాల్కా నాసిక మనసు చర్మము
ఆశ్రయిస్తడు, విషయ జాలమ్మే
అనుభవిస్తడు అర్జునా! -9

వెళ్ళువాడును, ఉన్నవాడును
లేక విషయాల్ పొందువాడగు
గుణుని, మూఢులు కాంచజాలరు
జ్ఞానచక్షులె కాంచ గలరోయ్. -10

యత్నశీలురు యోగులును తమ
లోని యాత్మను చూచుచుండిరి
యత్నమట్టుల చేసి చిత్తము
లేకశుద్ధిని కనరు మూఢులు. —11

సర్వజగతికి వెలుగునిచ్చే
సూర్యతేజము, అగ్నిచంద్రుల
నున్నతేజము అంతనాదే
అని గ్రహించుము. —12

నేను ధాత్రికి వచ్చి శక్తిని
సర్వప్రాణుల ధరిస్తున్నా
రసాత్మకుడగు శశిని అవుతూ
సర్వోషధుల పోషిస్తున్న। -13

నేను వైశ్వానరుడ నగుతూ
ప్రాణిదేహము నాశ్రయిస్తా
ప్రాణమపానముల కలుపుకొని
చతుర్విధాన్నముల పచిస్తా. 14

సర్వహృదయములందు నుంటిని
స్మృతియు జ్ఞానము మరపు కలుగును
నావలననే; వేదవేద్యుడ
నేనె వేదాంతమ్ము వ్రాసితి
వేదమెరిగిన వాడ నేనోయ్. —15

లోకమందున క్షరాక్షరులని
పురుషులిరువురు కలరు అందున
ప్రాణిమేనులు క్షరములవ్వను
కూటస్థుడక్షరుడు. -16

త్రిలోకమ్ముల నెవడు దాల్చునొ
నాశరహితుండైన ఈశుడు
అన్యుడుత్తమ పురుషవర్యుడు
ఆతడే పరమాత్ముడయ్యా! —17

క్షరుని కంటెను మించినాడను
శ్రేష్ఠుడను అక్షరుని కంటెన్
దాన-వేదము లోకమందున
పురుషోత్తమ ప్రసిద్ధి వడసితి. —18

ఎవడు మూఢత లేనివాడై
నన్ను పురుషోత్తముగ నెరుగునొ
సర్వవిదుడగు నతడు నిండగు
మనసుతో ననుభజిస్తాడు. —19

అనఘ! ఇట్టుల గుహ్యశాస్త్రము
నీకు చెప్పితినయ్య పార్థా!
ఇది గ్రహించిన జ్ఞానవంతుడు
కృతకృత్యుడు భారతా! —20

* ఉపనిషత్ప్రతి పాదగీతము
బ్రహ్మవిద్యయు యోగశాస్త్రము
కృష్ణనరసంవాద తత్త్వము
పురుషోత్తమ ప్రాప్తియోగము.

ఓం శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీభగవద్గీత

పదునారవ అధ్యాయం

## దైవాసుర సంపద్విభాగ యోగం

**శ్రీ భగవానుడు ఇలా అన్నాడు:-**

చిత్తశుద్ధియు దానమభయము
జ్ఞానయోగ స్థితియు దమమును
యజ్ఞమధ్యయనము తపస్సును
ఆర్జవము సుమ్మయ్యా! - 1

శాంతిత్యాగమహింస సత్యము
అక్రోధ మపైశునము దయయు
అలోలత్వము మృదుత్వమ్మును
అచంచలత్వము బిడియమున్. - 2

ఓర్పు శౌచము ప్రతిభ ధైర్యము
అద్రోహమును అగర్వమ్మను
గుణములన్ని దైవసంపద
యందుపుట్టిన వారి వర్జునః - 3

పార్థః డంబము అహంకారము
పారుష్యమును దర్పక్రోధాల్
అజ్ఞానమాసుర సంపదను
జన్మమెత్తగ కలుగుచున్నవి. - 4

బంధముక్తికి దైవసంపద
బంధ దృఢతకు ఆసురసంపద
నిశ్చయించితి దైవసంపద
యందుపుడితివి, విడువు దుఃఖము. -5

లోకమందున దైవ అసురుల
రెండు గుణముల ప్రాణులున్నవి
దైవసంపద విస్తరించితి
ఆసురమ్మును చెబుదువినుమా! -6

అసుర మనుజులు ప్రవృత్తిగాని
నివృత్తిగాని ఎరుగరయ్యా!
శౌచమాచారమ్ము ఉండదు
సత్యమున్నూ వారికుండదు. -7

వారు జగతి అసత్యమంటరు
అప్రతిష్ఠమకర్త యంటరు
కామకారణ మిద్ది, సంబం
ధసంభూతము అంటరయ్యా!
ఇంకొకటిలేదంటరయ్యా! -8

ఇట్టి దృష్టిని పూనిభువిలో
దుర్మనస్కులు అల్పబుద్ధులు
క్రూరకర్ములు అహితులవుతూ
జగతినాశనమునకు పుడతరు. -9

తనివితీరని కామవశులై
దంబమానాల్ మదము కలిగియు
మోహులై చెడు పట్టుపడతరు
అశుచి వ్రతులై ఆచరిస్తరు. -10

అపరిమితమామరణ త్యాజ్యము
అయిన కోరిక లాశ్రయించియు
కామభోగమె వరమ మనుకొని
మించదేదియు దీనిననుచున్ — 11

క్రోధకామము లాశ్రయి స్తరు
కామభోగము కొరకు తప్పుడు
దారులన్నీ తొక్కుతుంటరు
అర్థసంచయ చిత్తులవుతరు. -12

దీనినిప్పుడు నేనుపొందితి
ఇట్టికోరిక పిదప పొందుదు
ధనంబున్నది, ఇంక ఎంతో
మళ్ళి సంపాదించెదన్ - 13

ఇట్టిశత్రువు నిపుడుచంపితి
ఇతర శత్రుల చంపజాలుదు
ప్రభుడ భోగిని నేను సిద్ధుడ
సౌఖ్యవంతుడ శక్తిమంతుడ. -14

నేనుధనదుడ, శ్రేష్ఠ కులజుడ
నాసమానుడెవండు జగతిని?
యజ్ఞకర్తను దానమిచ్చెద
సంతసించెద ననెడు భ్రాంతులు -15

వివిధ విధముల చిత్తచపలురు
మోహ జాలసమావృతులవుతు
కామ భోగాసక్తులవుతూ
అశుచి నరకము నందు పడుదురు. -16

ఆత్మసంభావితులు స్తబ్ధులు
ధనాభిమాన మదాన్వితులును
వారు డంబముతోడ అవిధిగ
నామ యజ్ఞము చేయుచుందురు. -17

అహంకారము బలముదర్పము
ఆశ్రయింతురు కామక్రోధాల్
ఆత్మ పరదేహాలలోగల
నన్నసూయను ద్వేషిస్తరు. -18

అట్టిద్వేషుల క్రూరులశుభుల
నరాధములను, సంసారముల
మార్గమందున అసుర జన్మము
లందె ఎప్పుడు త్రోసి వేస్తా. -19

అసుర జన్మము పొంది మూఢులు
జన్మజన్మల నన్ను పొందక
అంతకంటెను నీచ జన్మల
పొందుతుండిరి కౌంతేయా! -20

కామక్రోధము లోభములునున్
మూడు విధముల నరకద్వారాల్
ఇవ్వితనకే చేయునాశము
కనుక మూటిని విడువ వలెనోయ్. -21

తమోద్వారములైన మూడిటి
నెవడు విడుచునొ తనకుశ్రేయము
చేసికొనునోయ్; దాన శ్రేష్ఠం
బైనపరమము పొందుచుండెను. -22

ఎవడు శాస్త్రము విడిచి ఇష్టము
వచ్చినట్టుల ప్రవర్తించునొ
అతడుసిద్ధిని సుఖము మోక్షము
పొందనేరడుగా. .23

కనుక నీకున్ చేయదగినది
చేయరానిది నిర్ణయించగ
ప్రమాణమ్మగు శాస్త్రమయ్యా!
తెలిసి శాస్త్రము కర్మ చేయగ
తగుదువయ్యా! .24

* ఉపనిషత్ప్రతి పాదగీతము
బ్రహ్మవిద్యయు యోగశాస్త్రము
కృష్ణనరసంవాద తత్త్వము
దైవాసుర సంపద్విభాగము.

*



ఓం శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీభగవద్గీత

పదునేడవ అధ్యాయం

## శ్రద్ధాత్రయ విభాగ యోగం

*** అర్జునుడు ఇలా అడిగాడు:-**

ఎవరు శాస్త్రము విడిచి శ్రద్ధగ
పూజచేస్తరో? వారి చేతలు
సాత్త్వికంబా? రాజసంబా?
తామసంబా? చెప్పుకృష్ణా! -1

*** శ్రీ భగవానుడు ఇలా చెప్పాడు:-**

ప్రాణి స్వభావములను కలిగిన
అట్టిశ్రద్ధయె సాత్త్వికంబని
రాజసంబని తామసంబని
మూడువిధములు, వినుము దానిని. -2

సర్వులకు సత్త్వాను రూపపు
శ్రద్ధకలుగును; జీవుడేమో
శ్రద్ధరూపుడు; ఎట్టిశ్రద్ధను
కలిగి ఉంటే అట్టిదేయగు. -3

సాత్త్వికులు తాదేవగణముల
రాజసులు యక్షరాక్షసులన్
తామసులు భూతప్రేతాలన్
పూజించు చుండిరి భారతా! -4

కామకాంక్షులు బలోపేతులు
దంభాహంకార యుక్తులును
శాస్త్రవిహితము కానీ ఘోరపు
తపమునేజను లాచరింతురో- —5

ఎట్టిజనములు దేహమందలి
భూతజాలము నెండ బెడుదురో
అంతర్యామిని నన్ను అణతురో
వారలసురులుగా నెరుండుము. -6

పార్థ! భోజనమెల్ల జనులకు
మూడువిధముల ఇష్టమగునోయ్
అలా యజ్ఞము తపము దానము
వాటిభేదము చెబుత వినుమోయ్! -7

స త్త్వమాయువు బలారోగ్యాల్
ప్రీతి సౌఖ్యము నిచ్చునవియును
రసము చమురును గలవి స్థిరులును
హృద్యాహారాల్ సా త్త్వికములు. 8

చేదుకారము పొగులవేడివి
ఉప్పు పులుపును విదాహమ్ములు
చమురులేనివి, వ్యాకులత్వము
రోగదుఃఖదులు రాజసములు. 9

యాతయామము అసారమ్మును
పాచియునుమరి ఎంగిలై నది
దుర్గంధాశుద్ధ భోజనము
తమోగుణులకు నిష్టమైనది. -10

చేయదగినదిగా మనస్సును
సమాధానము చేసి, శాస్త్రము
సమ్మతించిన ఫలత్యాగుల
అట్టియజ్ఞము సాత్త్వికమ్మోయ్. —11

ఫలముకోరుతు డంబమునకై
చేయుయజ్ఞమ్మేదికలదో
అద్ది రాజస యజ్ఞమగునని
సుద్దినెరుగుము అర్జునా! —12

శాస్త్రహీనము మంత్రరహితము
అదక్షిణమును అదానమ్మును
శ్రద్ధావిరహిత మగుయజ్ఞము
తామసమ్మగునోయిభారత! —13

సురల గురువుల ద్విజుల ప్రాజ్ఞుల
పూజచేయుట, ఋజుత శౌచము
బ్రహ్మచర్యమ హింస నడచుట
దేహతపమని అందురోయీ! —14

సత్యమైనది ప్రియమ్మయినది
అన్యులను బాధించనట్టిది
సుహిత వాక్యము, స్వాధ్యాయాభ్య
సనము వాచిక తపమ్మయ్యా! —15

మనస్స్వచ్ఛత ప్రసన్నత్వము
ఆత్మనిగ్రహమున్ను మౌనము
భావసంశుద్ధమ్ము కలిగిన
మానసికమను తపమ్మగును. —16

ఫలాపేక్షత్యక్తులు, యుక్తులు
అగుమనుష్యులు అధిక శ్రద్ధను
ఆచరించే త్రివిధ తపములె
సాత్వికమ్మని అందురయ్యా॰ -17

అన్యజనసత్కార కాంక్షతొ
పూజగౌరవములను అందగ
చేయుతపమది అస్థిరమ్మగు
అనిశ్చితమగు రాజసమ్మొయ్‌॰ -18

మొండిగా తన శరీరమ్మును
ఎండబెట్టుట, ఇతర జనముల
నాశమునకై చేయుతపమది
తామసంబగునయ్య పార్థా॰ -19

ఈయగాదగునట్టి దానము
దేశమును కాలమ్ము పాత్రయు
తెలిసి, ప్రతిగా ఏమి యివ్వని
వానికిచ్చిన సాత్వికమ్మగు. -20

ఫలముకోరుతు, ప్రతిగ నుపకా
రమ్ముకోరుతు, మనః క్లేశము
తోడ ఇచ్చిన దానమయ్యది
రాజసమ్మగు భారతా॰ -21

దేశమెరుగక, కాలమెరుగక
కనక పాత్రము, అగౌరవముగ
అసత్కృతముగ చేయుదానము
తామసమ్మగు భరతశ్రేష్ఠా॰ -22

"ఓంతత్‌సత్" అని బ్రహ్మమునకు
మూడుపేళ్లవి చెప్పబడ్డవి
పీటిచేతనె బ్రహ్మ జ్ఞానులు
శ్రుతులు యజ్ఞాల్ చేయబడ్డవి. -23

అందువల్లనె బ్రహ్మవాదుల
శాస్త్రోక్తమగు యజ్ఞదానము
తపఃక్రియలును "ఓం"పదమనిన
పిదపనె అనుష్ఠితములు. -24

తత్ పదమ్మును మోక్షకాంక్షులు
ఏ ఫలమ్మును కోరకుండా
వివిధ యజ్ఞాల్ తపః క్రియలును
దానకర్మలు చేస్తరయ్యా! -25

సన్నామంబుకలదు మంచిది
అనెడి అర్థమునకు ప్రయుజ్యము
అట్లె ఉత్తమ కర్మయందున
సత్‌పదమ్మది వాడబడుతది. -26

తపము యజ్ఞము దానమునగల
స్థితిని సత్తని అంటరయ్యా!
తదర్థమ్మగు కర్మలన్నీ
సత్తులనియే పిలుతురయ్యా! -27

శ్రద్ధనుంచక చేయుతపమును
ఇతరకర్మలు దాన హోమాల్
'అసత్' అనియే పిలువబడ్డవి
ఇహపరమ్ముల నవ్వి యివ్వవు. -28

* ఉపనిషత్ప్రతి పాదగీతము
బ్రహ్మవిద్యయు యోగశాస్త్రము
కృష్ణనరసంవాద తత్త్వము
శ్రద్ధాత్రయ విభాగయోగము.

*

ఓం శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీభగవద్గీత

పద్దెనిమిదవ అధ్యాయం

## మోక్షసన్యాస యోగం

*** అర్జునుడు ఇలా అన్నాడు:-**

మహాబాహో! కేశిసంహర!
త్యాగ సన్యాసముల తత్త్వము
వేరువేరుగ తెలియగోరితి
హృషీకేశా! చెప్పుమా! - 1

*** శ్రీ భగవానుడు ఇలా చెప్పాడు:-**

కామ్య కర్మల వదులుకొనుటయె
సన్న్యాసమని కవులు చెబుదురు
సర్వకర్మల ఫలము వదలుట
త్యాగమందురు కొందరేమో. - 2

బుద్ధిమంతులు తప్పువలెనే
కర్మవిడుచుట తగినదందురు
యజ్ఞదానతపాది కర్మలు
విడువదగదని కొందరందురు. - 3

కర్మత్యాగము నందునాదగు
నిశ్చయంబును వినుము పార్థా!
మూడువిధముల కలదు త్యాగము
వినుము చెప్పెద పురుషవ్యాఘ్రా! - 4

యజ్ఞదానతపాది కర్మలు
విడువదగనివి చేయదగినవి
యజ్ఞదానతపాల్ జ్ఞానులకు
పావనత్వము కలుగజేస్తవి. -5

ఇట్టికర్మలు, వీడిసంగము
ఫలము విడిచియు చేయవలెనని
నాదు నిశ్చితమైన ఉత్తమ
అభిప్రాయంబర్జునా! -6

నియతకర్మము తగదు విడువగ
మోహమున తానట్టి కర్మము
పరిత్యాగము చేసినప్పుడు
అద్దితామస త్యాగ మనబడు. -7

దేహశ్రమయను భయంపుట్టగ
దుఃఖదమ్మని కర్మ వదలితె
అతడు చేసిన దద్ది రాజస
త్యాగమవ్వును, పలముశూన్యం. -8

నియతకర్మము చేయదగినది
అని తలంచియు ఫలము సంగము
వదలి చేసిన యట్టి త్యాగము
సాత్త్వికంబగు నర్జునా! -9

జ్ఞానిసత్త్వుడు నసంశయుడగు
త్యాగశీలుడకుశల కర్మను
అసహ్యింపడు, కుశల కర్మము
నందుసక్తుడు కాడుగా. -10

దేహభృత్తుకు పూర్తికర్మలు
విడువసాధ్యము కానె కాదుగ,
ఎవడుకర్మల ఫలత్యాగో
అతడుత్యాగని పిలువబడును. -11

ఇష్టానిష్టము మిశ్రమమ్మని
మూడువిధములు కర్మఫలములు
కలుగు అత్యాగులకు చావగ
ఫలత్యాగులకెపుడు కలుగదు. -12

సర్వకర్మల సిద్ధికొరకై
కృతాంతంబును తెలుపు సాంఖ్యము
అందుచెప్పిన పంచకారణ
ములను చెప్పెద తెలిసికొనుమా! -13

ఇందుకర్తయు మరియు దేహము
వివిధ విధముల ఇంద్రియమ్ములు
వేరువేరుగ నుండు క్రియలును
దైవమైదవ దగును హేతువు. -14

నరుడు దేహము వాక్కుమనసను
వీటిచేతనె న్యాయమైనది
అన్యాయమగు కర్మ మొదలుకు
అవుతవీ అయిదు కారణము. -15

కర్మసంగతి యిట్టులుండగ
అకృతబుద్ధుడు సంగరహితుం
డైన ఆత్మను కర్తయనుకొని
దుర్మనస్కుడు నిజమునెరుగడు. -16

'నేనుకర్త'ను భావముండదో
బుద్ధి ఎవనిది అంటకుండునో
అతడు ప్రాణుల చంపినామరి
చంపనట్టులె; అతడబధ్యుడు. -17

కర్మనడుపగ తెలివి, జ్ఞేయము
తెలియువాడని మూడు విధములు
కర్మసంగ్రహమునకు కరణము
క్రియయుకర్తని మూడువిధములు. -18

సుగుణసాంఖ్యము నందు జ్ఞానము
కర్తకర్మగుణాది భేదాల్
మూడువిధముల చెప్పబడ్డవి
యథారీతిగ వినుము వానిని. -19

విభజితంబై సర్వప్రాణుల
ఒక్కటగునా అవ్యయాత్మను
దేనిచేతా నొక్కటిగనే
చూచు జ్ఞానము సాత్త్వికమ్మగు. -20

ఎట్టిజ్ఞానము చేత జీవుల
వేరువేరుగ నున్న ఆత్మల
వేరువేరుగ తెలిసికొనునో
అట్టిజ్ఞానము రాజసమ్మగు. -21

అహైతుకముగ తత్త్వమెరుగక
స్వల్పకార్యమ్మొకటె అంతని
తగిలియుండునో తెలియకుండునో
అట్టిజ్ఞానము తామసమ్మగు. -22

ఫలముకోరక నియతకర్మను
సంగరాగ ద్వేషరహితము
గా నొనర్చిన అద్ది సాత్త్విక
కర్మ యనబడు నర్జునా! —23

అహంకారుడు చేసినదియున్
ఫలాపేక్షుడొనర్చి నదియున్
కష్టమెక్కువ నున్నదియునున్
రాజసమ్మగు కర్మ సుమ్మోయ్. —24

చేయుకర్మన కలుగు దుఃఖము
బాధనాశము తనదు శక్తిని
తలచకుండా మోహమునతా
చేయుకర్మయె తామసంబగు. - 25

అనభిమానుడు ముక్తసంగుడు
ధృత్యుత్సాహ సమన్వితుడును
సిద్ధ్యసిద్ధుల నిర్వికారుడు
అయిన కర్తయె సాత్త్వికుండగు. - 26

ఫలాపేక్షుడు, రాగి, లుబ్ధుడు
హర్షశోకాన్వితుడు, హింసక
భావుడశుచుడు, కర్త అయితే
ఆతడు రాజసుడర్జునా! - 27

పామరుడు, సోమరుడయుక్తుడు
శఠుడు, స్తబ్ధుడు, నైష్కృతికుడును
దీర్ఘసూత్రుడు, విషాదుండును
అయినకర్తయె తామసుండగు. -28

ఓ ధనంజయ! బుద్ధిధైర్యము
గుణాదులతో మూడువిధములు
వేరువేరుగ పూర్తిగామరి
చెప్పబడుతున్నాది నినుమా! —29

ఎట్టిబుద్ధి ప్రవృత్తి నివృత్తి
ఎరిగి, కార్యాకార్యము తెలిసి
భయాభయమును బంధమోక్షము
నెరుగునోఅది సాత్వికమ్మగు. —30

ధర్మమందు నధర్మమందును
కార్యమందున కార్యమందును
తప్పుగామరి తెలిసికొంటే
అట్టిబుద్ధియె రాజసమ్మగు. —31

తామసముచే బుద్ధికప్పగ
అధర్మమ్మును ధర్మమనియును
సర్వార్థముల విరుద్ధమ్ముగ
తలచగానది తామసమ్మగు. —32

అచలితమ్మగు ధృతిని, ప్రాణము
మనసు ఇంద్రియ సర్వక్రియలను
యోగసాధన చేత నిలిపిన
ధైర్యమది పార్థ! సాత్వికము. —33

ధైర్యమ్ముతో ఫలముకోరుతు
ధర్మకామార్థాభిలాషను
కార్యములలో గమిస్తాడో
ధైర్యమది పార్థ! రాజసము. —34

ఎట్టిబుద్ధిని దుర్మనస్కుఁడు
దిగులు దుఃఖము నిదుర భయమును
మదము విడువక వ్యవహరించునో
ధైర్యమది పార్థ! తామసము -35

ఎట్టిఅభ్యాసమున సుఖమును,
దుఃఖనాశము లెస్స పొందునో
ఆ సుఖమ్మును మూడువిధముల
భారతా! విను తెలుపుతున్నా! -36

ఏసుఖమ్మది మొదట గరళము
చివర అమృతము భంగినుండునో
అమలినమ్మగు ఆత్మబుద్ధికి
సాధ్యసుఖమది సాత్త్వికమ్మోయ్. -37

విషయ ఇంద్రియ సంయోగమున
ఏసుఖమ్మది మొదట అమృతము
చివర గరళము పోలెనుండునో
సుఖమ్మయ్యది రాజసమ్మోయ్. -38

నిదుర అలసత ప్రమత్తతచే
పుట్టుసౌఖ్యము మొదట చివరను
తనకు మోహము కలుగజేయునో
సుఖమ్మయ్యది తామసమ్మోయ్. -39

ప్రకృతి జనితము లీత్రిగుణముల
కూడియుండని దైన వస్తువు
ఏదికలదో అద్ది భువిలో
దివిని సురలన్ ఎచట లేదోయ్. -40

బ్రాహ్మణులకున్ వైశ్యక్షత్రియ
శూద్రజనులకు కర్మలేమో
స్వభావజమగు నట్టిగుణముల
బట్టి విభజితమయిన వయ్యా! -41

శమము దమమును తపము శౌచయు
జ్ఞానవిజ్ఞానమును ఋజుతము
ఆస్తికత్వము ఓర్పు స్వభావ
జములు బ్రహ్మకర్మమ్ముల్. —42

ధృతియు దాక్ష్యము తేజు శూరత
యుద్ధమందపలాయనత్వము
దానమీశ్వర భావము, స్వభా
వజములు క్షత్రియకర్మల్. -43

కృషిగోరక్ష వాణిజ్యములు
స్వభావజములు వైశ్యకర్మలు
పరిచర్యాత్మకమగు కర్మము
స్వభావజమగు శూద్ర కర్మము -44

తమదు కర్మల శ్రద్ధ మనుజుడు
పొందు సంసిద్ధిని కిరీటీ!
స్వీయకర్మనిరతుడు ఎట్టుల
సిద్ధిపొందునో చెబుత వినవోయ్. —45

ప్రాణిపుట్టుక ఎవని వలననో
ఎవనిచేనిల సర్వవ్యాప్తమో
మనిషి అతనిని స్వీయకర్మన
ఉపాసిస్తూ సిద్ధిపొందును. —46

స్వీయధర్మము విగుణమైనా
అనుష్ఠితమగు పరుల ధర్మము
కన్న శ్రేయము, స్వభావనియత
మైనకర్మము చేయగామరి
పాపమ్ము పొందడుగా. -47

సహజకర్మము దోషయుక్తము
అయిన దానిని వదలకూడదు
ధూమమగ్నిని కప్పినట్టుల
దోషావృతా లన్ని కర్మలు. -43

సర్వమున తాననాసక్తుడు
జితాత్ముండు విగతస్పృహుడును
సంగత్యాగము చేసి ఉత్తమ
నిష్క్రియాత్మ స్థితిని పొందును. -49

సిద్ధిపొందిన ఎటుల బ్రహ్మము
పొందునో అది, పరాజ్ఞానము
నిష్ఠయనునది సంగ్రహంగా
చెబుదుపార్థా! తెలిసికొనుమా! -50

శుద్ధబుద్ధుండైన యుక్తుడు
ధృతిని మనసును నిగ్రహిస్తడు
విడిచి శబ్దాదివిషయాలను
రాగద్వేషాల్ వదలివేస్తడు -51

ఏకాంతుడును మితాహారియు
మనము వాక్కు-శరీరవశుడును
నిత్యయోగధ్యాన పరుడును
వైరాగ్యసముపాశ్రితుండున్- -52

అహంకారము బలము దర్పము
కామక్రోధాల్ సంగ్రహణముల
పరిత్యక్తుడు, అమమకారియు
శాంతుడు బ్రహ్మైక్య సమర్థుడు. —53

బ్రహ్మభూతుడు ప్రసన్నాత్ముడు
ఏదీకోరడు దుఃఖమందడు
సర్వభూతములందు సముడై
పరమమగునాభక్తి పొందును. 54

భక్తిచేనేనెంత వాడనొ
ఎట్టివాడనొ తెలిసికొంటడు
దానివల్లనె నన్ను నిజముగ
ఎరిగి తదుపరి చేరుకొంటడు. -55

సర్వకర్మలనెపుడు చేయుచు
నన్ను ఆశ్రయమందువాడును
నాప్రసాదమునంది అవ్యయ
స్థిరపదమ్మును అందుకొంటడు. -56

సర్వకర్మల సమర్పింపుము
చేతసుడవై, మత్పరుడవై
బుద్ధియోగము నాశ్రయింపుము
చేర్చు చిత్తము నెపుడునాలో. —57

మచ్చిత్తుడవు అయిన నాదయ
పొందికష్టాలన్ని దాటుదు
అహంకారము వల్ల నాయివి
వినకపోతే చెడుదువయ్యాః -58

అహంకారము వల్ల యుద్ధము
చేయనేనని తలచినాడవొ
అట్టియత్నము వ్యర్థమవుతది
నిన్ను ప్రకృతే నియోగిస్తది. .59

స్వభావజమగు నీదుకర్మకు
నిబద్ధితుడవు, కానిమోహము
వలన చేయగ నిచ్ఛగించవు,
అయిన అవశుడ వగుచు చేస్తవు. -60

సర్వభూతాల్ యంత్రమెక్కిన
వలెనెత్రిప్పుచు తనదు మాయను,
ఎల్లప్రాణుల హృది స్థలిలో
కలడు ఈశ్వరు డర్జునా! .61

భారతా! ఇక సర్వవిధముల
అతని శరణమె పొందుమయ్యా!
అతనిదయచే పరమశాంతిని
శాశ్వతస్థానమ్ము నందుదు. -62

ఇట్టి గుహ్యముకంటె గుహ్యము
అయిన జ్ఞానము నీకు చెప్పితి
దీనినంతా విమర్శించక
ఎలా తలతువొ అలా చేయుము. -63

సర్వగుహ్యములందు గుహ్యము
పరమవాక్యము మరల వినుమోయ్
నాకుమిక్కిలి ప్రియతముండవు
నీహితానికె చెప్పుతున్నా. 64

మన్మనుడవై భక్తుడవునై
ననుభజింపు నమస్కరింపుము
నన్నెపొందుదు నాకు ప్రియుడవు
ప్రతిన నిజముగ చేయుచున్నా. —65

సర్వధర్మాల్ వదలిపెట్టుము
నన్నొకణ్నె శరణుపొందుము
సర్వపాపాల్ నిన్నువీడగ
నేను చేతును దుఃఖపడకుము. —66

నీవు దీనిని తపోరహితుకు
వినగకోరిక లేని వానికి
నన్ను దూషణ చేయువానికి
అభక్తునికిని చెప్పగూడదు. —67

పరమగుహ్యం బైనదీనిని
నాదుభక్తులకెవడు చెప్పునొ
అతండు త్తమ భ క్తియుతుడై
అసంశయుడై నన్నెచేరును. -68

మనుష్యులలో అతనికంటెను
ప్రియముగూర్చెడి వాడు లేడోయ్
అతనికంటెను ప్రియతముండును
నాకు భువిలో కలుగబోడోయ్. —69

ధర్మమగు నీ ఉభయ వాదము
ఎవండధ్యయనంబు చేయునొ
అతను చేసే జ్ఞాన యజ్ఞము
కేను ఇష్టుడ-నాదు మతమిది. —70

శ్రద్ధతో అనసూయుడైనరు
డెవ్వడియ్యది తానువింటడో
అతడు ముక్తుడు పుణ్యకర్ముల
పుణ్యలోకము లందుకొంటడు. -71

పార్థ! ఏకాగ్ర మనస్సుతో
దీనినంతా నీవు వింటివ!
నీదు అజ్ఞానంపు మోహము
పూర్తినష్టమ్మాయెనా! 72

*** అర్జునుడు ఇలా అన్నాడు:-**

కృష్ణ! నీదయ వలన మోహము
తొలగె, జ్ఞానము కలిగెనయ్యా!
సంశయంబులు కదలిపోయెను
నీ మాట పాటిగ నడిచెదన్. -73

*** సంజయుడు ఇలా పలికాడు:-**

కృష్ణనరసంవాదమియ్యది
పులకరింతలు పుట్టజేస్తది
అద్భుతాలను ముంచివేస్తది
ఈ ప్రకారము వింటినయ్యా! -74

కృష్ణయోగేశ్వరుడు చెప్పగ
వేదవ్యాసులదయన గుహ్యము
పరమ శ్రేష్ఠమ్మయిన యోగము
ప్రత్యక్షముగ వింటినయ్యా! -75

పరమపావన మద్భుతంబును
కృష్ణనరసంవాద తత్త్వము
సంస్మరిస్తూ సంస్మరిస్తూ!
రాజ! మాటికి హృషిస్తున్నా! 76

అద్భుతంబగు విశ్వరూపము
తలచి తలచియు విస్మయించితి
మాటి మాటికి దాని తలచుకు
ఆనందిస్తున్న రాజా! 77

ఎచటయోగేశ్వరుడు కృష్ణుడు
ధనుర్ధారిగ ఎచట పార్థుడు
ఉందురచ్చట శ్రీయువిజయము
భూతినీతి ఉండు నామతము. 78

* దైవభాషగు సంస్కృతమ్మున
వ్యాసముని వ్రాశాడు దీనిని
శతసహస్రసుశ్లోక మిద్ది
సుఛందమ్మున కూర్చబడ్డది
మహాభారత మనెడు పంచమ
వేదవిద్యా గ్రంథమందున
భీష్మపర్వసుపర్వమందున
ఉపనిషత్ప్రతి పాదగీతము
బ్రహ్మవిద్యయు యోగశాస్త్రము
కృష్ణనరసంవాద తత్త్వము
మోక్షసన్యాస యోగమ్ము.

సంపూర్ణం

**ఓం తత్ సత్**

ఓం

# శ్రీ గీతామాహాత్మ్యం

*** భూదేవి ఇలా ప్రశ్నించింది:-**

పరమపురుషా! భక్తవరదా!
ప్రారబ్ధమును పొందువానికి
అచంచలమగు భక్తి ఎట్టుల
కలుగ గలదయ్యా! —1

*** శ్రీ మహావిష్ణువు ఇలా చెప్పాడు:-**

ప్రారబ్ధమును పొందుతున్నా
ఎవడు సతతము గీతచదువునో
అతడు ముక్తుడు కర్మలంటవు
సుఖము పొందును జగతిలో. . 2

తామరాకును జలములంటని
అట్లు గీతను చదువువానికి
మహాపాపములైన కొంచము
అంటజాలవుగా. —3

ఎచట గీతా గ్రంథముంటదో
ఎచట గీతను చదువుతుంటరో
అట ప్రయాగయు సర్వతీర్థాల్
ఉంటవెప్పటికిన్. . 4

గీతనెచ్చట చదువుతుంటరో
ఋషులు యోగులు గోపబాలురు
సర్వదేవతలున్ను నాగులు
పార్శ్వ వర్తులు నారదోద్ధవు
లటకు వేగమె ఏగుదెంతురు
సహాయమ్ము చేస్తారు. . 5

ఎచట గీతను గూర్చి పఠనము
బోధ శ్రవణము చర్చ జరుగునా
అచటనెప్పుడు నేను తప్పక
నివసిస్త భూదేవీ! -6

నేను గీతను ఆశ్రయించితి
గీత ఉత్తమ గృహమునాకగు
గీత జ్ఞానము నాశ్రయించియె
మూడు లోకాలేలుతున్నా. -7

గీతనాదగు పరమ విద్యయు
బ్రహ్మరూపము అసంశయమిది
అర్ధమాత్రాక్షరము నిత్యము
నాశరహితము అనిర్వాచ్యము. -8

చిదానందుడునైన కృష్ణుడు
పార్థునకునిది చెప్పె తల్లీ!
త్రయీవేదము పరానందము
ఆశ్రయిస్తే తత్త్వమబ్బును. -9

ఎవడు నిశ్చలమైన మనసున
రోజు గీతను అంత చదువునా
జ్ఞానసిద్ధిని పొందియాతడు
మోక్షపదమును బడయ గల్గును. -10

గీత నంతా చదువకుంటే
అర్ధభాగము చదువ వలయును
అందువల్లనె గోవునిచ్చిన
పుణ్యమబ్బును అసంశయమిది. -11

త్రిభాగమ్మును చదువ నతనికి
గంగయందలి స్నానఫలమును
షడంశమ్మును చదువునతనికి
సోమయాగపు ఫలితమబ్బును. -12

ఒక్క భాగము భక్తిమోడుత
రోజుచదివిన రుద్రలోకము
పోయి ఆతడు అచటి గణముల
లోన ఒకడై ఉండు సతతము. -13

రోజధ్యాయమందు నాల్గవ
భాగమెవ్వడు చదువ నాతడు
ఉత్తమంబగు మనిషి జన్మను
ఓవసుంధరః పొందునాతడు. -14

గీతలోగల శ్లోకములలో
పదియొ ఏడో అయిదొ నాలుగొ
మూడొ రెండో ఒకటొ సగమో
ఎవడు నిత్యము చదువు చుండునొ- -15

చంద్రలోకము వెళ్లి ఆతడు
వేలవర్షాల్ సుఖముపొందును
గీత చదువుచు నెవడు చచ్చునొ
అతండుత్తమ మనిషి జన్మము
నందుకోగలడు. -16

అటుల మనిషిగ పుట్టి ఆతడు
గీతనెప్పుడవ చదివి చదువుచు
మోక్షమందును, 'గీత గీతా'
అంటుచచ్చును పొందు సద్గతి. -17

మహాపాపియు గీత అర్థము
వినుటయందా సక్తి చూపిన
వైకుంఠమును పొంది అచ్చట
విష్ణుతోసహమోద మందును. -18

గీత అర్థము రోజు చింతన
ఎవడు చేయునో అతడుకర్మల
నాచరించియు ముక్తుడనబడు
దేహాంతమున మోక్షమందును. —19

జనకుడాదిగ రాజులెందరో
జగతిలోపల ఆశ్రయించిరి
గీతనందున పాపరహితులు
అగుచు పరమ పదమ్ము పొందిరి. —20

గీత చదివిన పిదప మహిమను
ఎవడు చదువడో అతని పఠనము
వ్యర్థమేయగు, ఆ మనుష్యుని
పఠన శ్రమయని చెప్పబడ్డది. -21

ఈ మహాత్మ్యము తోడగీతను
చదువనాతడు పైన తెలిపిన
ఫలము పొందును, అలభ్యంబగు
మోక్షమందునుగా. —22

*** సూతుడు ఇలా చెప్పాడు:-**

ఈ విధమ్ముగ సనాతనమగు
మాహాత్మ్యమును మీకు దెలిపితి
గీతాంతమున దీనినెవ్వడు
చదువ చెప్పిన ఫలము పొందును. -23

* ఇదివరాహ పురాణమందలి
శ్రీయుత శ్రీగీత సంస్తవ
విశదపూర్వక మాహాత్మ్యమ్ము
సర్వము సమాప్తమ్ము.

*

## దైవప్రార్థన

ఈశ! దేవా! శ్రీదయాళూ!
ఎల్లవేళల నాదుచిత్తము
నీ పాదపద్మాల నిలువగ
అచంచలమగు భక్తి నిమ్మా!

నిద్రలేచి పరుండు వరకును
ఎవరికపకారమ్ము చేయని
పరులకుపకారమ్ము చేసెడు
బుద్ధినిమ్ము దయానిధీ!

నిర్మలాత్మా! ఎపుడు మనసున
దుష్టభావము విషయ వాసన
మోహ వృత్తియు రానియట్టుల
దయతోనను చూడు దేవా!

భక్తిజ్ఞానవిరాగ బీజాల్
నాలో మొలచునట్లు చేయుము
నిన్ను చేర ఈ జన్మముననె
శక్తి నిమ్ము మహానుభావా!

దేవదేవా! దీనరక్షక!
నీవెనాకిక దిక్కుసామీ!
నేనునిన్నే ఆశ్రయించితి
వినతివినుమా! దరిని జేర్చుకో!

నేనసత్తున నుంటిగావున
నన్ను సత్తున కీవుగొనిపో
నేతమస్సున నుంటి గావున
నను ఉషస్సున కీవు గొనిపో

పావనాశక పాహిమాం!
భ్రాంతి దూరక రక్షమాం!
భక్తవత్సల పాహిమాం!
ప్రజాపాలక రక్షమాం!

— * —